Rs. 2-00 July 1987

32nd Year of Publication




జులై - 1987



'చదరంగమంటే వాకిష్టం'

—'జర్మన్ ట్రిబ్యూన్' సౌజన్యంతో

'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 – సం॥ చందా రు. 24-00. 2 సం॥లకు రు. 45-00. 5 సం॥లకు రు. 100-00. జీవిత చందా రు. 300-00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం: గుజరాత్ గవర్నరు త్రివేది

# నిమ్మతోనలు

లక్షాధికారి సన్యాసిరావు బాలా పిసి నారి. ఎప్పుడైన సినిమాకెళితె చివరి టిక్కెట్టుకే పోయేవాడు. ఉండ బట్టలేక ఒకరోజు ఆయన స్నేహితుడు అడిగాడు.

"పైక్లాసుకు పోలేక కాదు. కాకపోతే నాకు దూరపు వస్తువులు సరిగా కన్పించవు" అని చెప్పి తెలివిగా తప్పించుకున్నాననుకున్నాడు సన్యాసిరావు.

—కె నాగేశ్వరావు

నరసారావుపేట

నేను ఇంకా పెద్దయ్యాక తహసిల్దారుని పెళ్ళిచేసుకుంటా – అంది పదేళ్ళ ఉష 'నేను ఇంకా పెద్దయ్యాక తహసిల్దారు దగ్గర బంట్రోతుని పెళ్లి చేసుకుంటా'– తను ప్రతికలిపింది ఆమె.

'ఎందుకని ?' అడిగింది ఉష.

'తహసిల్దారు కన్న తహసిల్దారు దగ్గర బంట్రోతుకే కదా మామూళ్ళు ఎక్కువ వచ్చేది.'

—సెల్చి

నందిగామ

ఇరువురు మిత్రులు సాయంకాలమున రోడ్డు మీద వెళ్తున్నారు. వారు కొంత దూరము వెళ్ళిన తరువాత స్పీడ్ బ్రేకర్స్ కలవు అని వ్రాసిన బోర్డు చూచి 'మిత్రమా ఈ స్పీడ్ బ్రేకర్స్ ఎందుకు?' అని ప్రశ్నించాడు ఒకతను.

'త్రాగుబోతు డ్రైవర్లను జాగ్రత్తగా వాహనములు తోలమని గుర్తుచేసేటందులకు.'

—నాగరాజు

నెల్లూరు

వరాలా మీ అక్క ఎప్పుడూ 'నమస్కారం - నమస్కారం' అని పళ్ళు ఇకలిస్తుంటుంది, 'దేనికి ?' అడిగింది రూప.

'మా అక్క టి. వి.లో ఎనౌన్సర్‌గా పనిచేస్తూంది - నీకు తెలీదా ?'

—జి రాము

నందిగామ

చూడండి .... ఈ పెద్ద పేకెట్‌లో ఉన్న వస్తువుని పేకెట్ విప్పకుండా బయటకి తీస్తా -ప్రేక్షకులతో అన్నాడు ఇంద్రజాల ప్రదర్శకుడు.

'అలాంటివి మేం చాలా చేసాంగాని ఇంకో క్రొత్తఐటం ఉంటే చూపించవోయ్' - ప్రేక్షకులలోంచి అరిచాడు పోస్ట్‌మేన్ పుల్లారావు.

—రమేష్

రాజమండ్రి-2

అబ్రహాంలింకన్ చాలా నిరాడంబరంగా జీవితము సాగించేవాడు.

లింకన్ ఓరోజు తానే బూట్లకు పాలిష్ వేసుకుంటూంటే ఓ మిత్రుడు చూశాడు. 'అదేమిటి ఘాజ్ మీరే పాలిష్ వేసుకుంటున్నారా ?' ఆశ్చర్యంగా అడిగాడు.

లింకన్ నవ్వుతూ చెప్పాడు 'మరి ఇంకెవరి బూట్లకైనా పాలిష్ వేస్తారా?'

—డిపి సత్యనారాయణమూర్తి
వ్రాడేవుపల్లి

ఓసే రాధా మావారితో సినిమాకు వెళ్లావుట. ఒళ్ళెలా ఉందే !' అంది జానకి.

'మహ నీకు మొగుడేమో కాని పెళ్ళికాక ముందు అతను నా బాయ్ ఫ్రెండ్ ! తెల్సిందా ?'

'అ ఏమన్నావ్ ?'

—సిహెచ్ నాగేశ్వరావు
సికిందరాబాదు

పరీక్షలో ఫస్టక్లాస్‌లో రావాలి నాయనా' అన్నాడు తండ్రిగారు కొడుకు నుద్దేశించి.

రెండునెలలు తరువాత ఇంటి కొచ్చిన కొడుకుతో 'ఫస్టక్లాస్‌లో వచ్చావా నా తండ్రీ, నా పేరు నిల బెట్టావురా నాయనా' అన్నాడు గర్వంగా.

'అవును, నాన్నారూ' నావద్ద డబ్బు లేదు - అప్పుచేసి టికెట్ కొని ఫస్ట క్లాస్‌లోనే వచ్చాను' అన్నాడు కుమారశ్రీ.

—ఎమ్ వి వరప్రసాద్
ఇబ్రహీం పట్నం

నా దేశమే నా ప్రపంచం : మంచిని పెంచడమే నా మతం.

—థామస్ పెయిన్

దేవుడు దేశాన్ని సృష్టించాడు; నరుడు పట్నాన్ని నిర్మించాడు.

—కౌపర్

మేము కొలిచే దేవత పేరు స్వాతంత్ర్యం. ఆమె మా రాజ్యమేలే రాణి. —ఎమర్సన్

# పాఠకుల తీర్పు

మిత్రులు శ్రీ చందూర్ గార్కి:
ఉగాదినాడు ఆంధ్రప్రదేశ్ రాజధానిలో మీ ఉభయులకు కలిగిన నష్టం, హృదయ వేదన మాకు చాలా బాధ కలిగించింది.... అయితే మీరు ఉభయులు ప్రాణాపాయం నుండి బయటపడడంకు కొంత మనశ్శాంతి.. సోదరి మాలతిగారికి నమస్కారములు.... మీరు ఆ చిత్రం గురించి చేసిన కామెంట్స్‌ను ఇక్కడి సెన్సార్ వారి దృష్టికి తీసుకురాగలను.... మే నెల సంచికలో పేజీలు తప్పు పడ్డాయా?.... 'నాలుగు రోజుల క్రితం పిక్చర్లో ఒక ప్రఖ్యాత తార దారుణమైన అశ్లీలాలు పలికింది' అని వ్రాశారు ఆవిడెవరు?.... 'హైదరాబాదులోని సెన్సారు సభ్యులకు తెలుగు రాదా?' అని ప్రశ్న వేశారు. ఈ ప్రశ్న కూడా రత్నప్రభ గారి (రీజనల్ ఆఫీసర్) దృష్టికి తెస్తాను.... 'పాముని, కోతిని, కుక్కని, గొర్రె పొట్టేలుని నమ్ముకునే స్థితికి వచ్చింది తెలుగు సినిమా' అని మీ రనడం నాకు పరమసత్యం అనిపించింది. మీరు నిష్పాక్షికంగా వ్రాసినందుకు అభినందనలు. శుభాకాంక్షలతో....

—డా॥ దాశరథి
హైదరాబాదు-29

ప్రియమైన చందూర్ దంపతులకు:
మొన్న ఉగాదినాటి హైదరాబాద్ సంఘటన నాన్నగారు రాశేరు. ఇలాంటివి నిత్యం పేపర్లలో చదువుతూ వింటూ ఉంటాము. కాని ఎంత భయంకరమో స్వానుభవంలో కాని అర్థం కాదు. సినిమాల్లోను, టి. వి లోను కార్లు, ట్రక్కులు గుద్దుకుని గిరగిర తిరగడం ఎన్నిసార్లు చూసినా, నాకేమీ అనిపించలేదు కాని ఒకసారి హైవేమీద పెద్ద ట్రక్కు నేనున్న "లేన్"కి వచ్చి, నన్ను చూడకుండా నా కారు కొట్టేయడంతో కంట్రోల్ తప్పి, సినిమాల్లోలా గిరగిరా తిరిగిపోయింది కారు. అది ఏక్సిడెంట్ కాకుండా ఎలా ఆపేను అనేది ఇప్పటికీ నాకు తెలియదు. ఆ అనుభవంతోనే ఎపుడు రోడ్డుమీద ట్రక్కుని చూసినా గుండె దడదడా కొట్టుకునేది. చాలాకాలం అయినందువల్ల ఇపుడు అంత భయం అనిపించడంలేదు. కాలం తెచ్చేమార్పు అదే! మాకు నా సంతోషాన్ని తెలియచెయ్యగల శక్తి, నాకు లేకపోయినా, అర్థం చేసుకునే మనసు మీకుందనే నమ్మకంతో ముగిస్తున్నాను.

—శాంతా మూర్తి
పిఎ - 17057 - అమెరికా

# ప్రాచీన సాహితి

గంగా ధౌతశిలాతలంబు హరగోస్కంధ ప్రదేశాహ తో
త్తుంగక్ష్మాజము సిద్ధ సేవిత గుహా స్తోమంబు శీతాచలో
స్సంగం బుండగ నెవ్వడోపు నృపపాదంబుల్ దలం దాల్ప
రంగీ శాబ విలోచనల్ మనసిజాస్త్రంబుల్ సతుల్ లేనిచోన్.

—భర్తృహరి



గర్వంబు కొఱగాదు కార్య వంతులకును
కోపంబు కొరగాదు తాపసులకు
దైన్యంబు కొరగాదు ధైర్య వంతులకును
నలసట కొరగాదు యాచకులకును
చపలత కొరగాదు సదమల జ్ఞానికి
సతికాంక్ష కొఱగాదు అవనిపతికి
దుశ్చింత కొరగాదు దురిత దూరునకును
వంచన కొఱగాదు వరభటునకు
క్రమము దప్పక దమనేర్పు కలిమి మెఱసి
మెలగ నేర్చిన నరులకు గలుగు శుభము
ప్రణుత ధవళాంగ మౌని హృత్పద్మభృంగ
అమిత భవ భంగ శ్రీ కాళ హస్తిలింగ

—కాళహస్తిలింగ శతకం

బళిరా! సత్కవి వౌదు నిక్కమ! తగన్ భావించి నీ వన్న యా
యెల ప్రాయంపు మిటారి కత్తెల బెడం గే నెందునుం గాన వా
రల డోలా చలనోచ్చల చ్చరణముల్ త్రివిష్టప స్త్రీల యా
దల దన్నం జనునట్లు మించె ననినం దప్పేమి? యొప్పె యగున్.

—పింగళి సూరన 'కళాపూర్ణోదయం'

# ప్రాతికేళ్లనాటి పిక్చర్

## జాన్ బార్లో
## 'టీచర్'

ఉత్తర ఇంగ్లాండులో ఓ చిన్న పట్టణం. ఆ పట్టణంలో నిరాడంబరుడైన ఒక ఉపాధ్యాయుడు అతను నిష్కల్మష హృదయుడు

అతని భార్య ఒక ఫ్రెంచి యువతి. ఈ దంపతులిద్దరూ కడుపేదలు. దారిద్ర్య పరిసరాలు నిస్పృహ కలిగిస్తాయి ఉపాధ్యాయుని భార్యలో. ఉపాధ్యాయుని పేరు ఏర్.

అతని తరగతిలోని తెలివిగల పిల్లలలో షర్లి టెయిలర్ అనే విద్యార్థిని ఉంది - వయస్సు 15 సంవత్సరాలు. ప్రయివేట్ చెప్పమని అడుగుతుంది టీచరుగార్ని. సంతోషంగా సరేనంటాడు.

అయితే ఆ అమ్మాయికి కావలసినది చదువు కాదు - ఏర్. పాపం, అతనా విషయం గుర్తించనైనా గుర్తించడు. అయితే భార్య పసిగడుతుంది. పారిస్‌లోని ఒకానొక పాఠశాలలో వీరిద్దరు ఒకరోజు ఉండవలసి వచ్చేవరకు ఏర్‌కు అసలు సంగతి తట్టదు.

తిరిగి వచ్చేటపుడు వారిద్దరు లండన్‌లో ఒకరోజు గడపవలసి వస్తుంది. షర్లీ అతని గదిలోకి వెళ్ళి ప్రేమ కలాపం ప్రారంభిస్తుంది. మర్యాదగానే గట్టిగా మందలించి పంపించేస్తాడతను. ఇంటికి వెళ్ళాక తనని అవమానించాడని తల్లికి చెబుతుంది షర్లీ.

న్యాయస్థానంలో విచారణ. ఆ పిల్ల కట్టుకథలన్నీ పటాపంచలు చేస్తాడు ఏర్ తరఫున న్యాయవాది. అమాయకుడైన ఏర్ నిర్దోషి అని తీర్పు చెబుతారు. కాని ఆకాశ రామన్న జాబులు మాత్రం ఆగవు. ఉద్యోగంలో పైకి వెళ్ళగల అవకాశం తప్పిపోతుంది. భార్య అతనిని వదిలేసి వెళ్ళేందుకు సిద్ధమవుతుంది.

ఇదీ 'టరమ్ ఆఫ్ ట్రయల్' అనే చిత్రంలోని కథ. ఉపాధ్యాయునిగా సర్ లారెన్స్ ఆలివర్ అద్భుతంగా నటించాడు. అతని భార్యగా మైల్ సెనిరెటా తన పాత్రని చక్కగా పోషించింది. ఇంతవరకు కెమెరా ముందు నించుని ఎరగని 19 సంవత్సరాల సారామైల్స్, షర్లీగా ఆకర్షణీయమైన నటన కనబరిచింది.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' - జూలై 1962

కోపర్నికస్, గెలిలియో, న్యూటన్‌ల కంటె మానవుని భావపరంపరలో విప్లవాత్మక పరిణామం తెచ్చిన మహనీయుడు ఆల్బర్ట్ అయిన్‌స్టీన్.

-హాల్డేన్

# వెన్నెల కెరటాలు

## మైథిలీ శరణ గుప్త

ఇరవయ్యో శతాబ్దం ప్రారంభంలో గుప్తగారు కవితా వ్యవసాయం ప్రారంభించినప్పుడు ఈనాడు హిందీభాషగా దేశమంతట ప్రసిద్ధమయిన 'ఖడీబోలీ' అనే మాండలికం వచనరచనలకే గాని కవిత్వ రచనలకు పనికిరాదని నిరసింపబడేది. ఖడిబోలీ అంటే హిందీ, కవిత్వ రచనకు ఉపయుక్తమయినదని నిరూపించడానికి ఒక ఉద్యమమే నిర్వహింపవలసి వచ్చింది. మహావీర్ ప్రసాద్ ద్వివేది నాయకత్వాన జరిగిన ఆ ఉద్యమం ప్రేరకశక్తిగా ఖడిబోలీ హిందీలో కవితా రచనలు గావించి, దానిని కావ్యభాషగా తీర్చిదిద్దిన కవులలో మహాకవి శ్రీ మైథిలీ శరణ గుప్త గారు మిన్న. గుప్తగారి అమృత లేఖినిలో రూపు రేఖలను దిద్దుకొని, పుష్టిని, ఒయ్యారాలను నేర్చుకొని ఛాయవాద మనే యౌవనప్రాయంలోకి అడుగు బెట్టింది హిందీ కవితా సరస్వతి. కాలంతోపాటు మారుతూ క్రొత్త గాలులతో ఊపిరి పోసుకొంటూ, గుప్తగారు ఆ తరువాత వచ్చిన ఛాయావాద, ప్రగతివాద కవితా శిల్పాలను కూడసమర్ధవంతంగా నిర్వహింపగలగటం విశేషం. ఆయన కవిత లనేకం ఉన్నత శ్రేణి ఛాయావాద ప్రగతివాద కవుల కవితలతో పోటీ పడుతూంటాయి. 'ఝుంకార్' అనే కవితా సంపుటిలో భావవాద శిల్పానికి సంబంధించిన కవితలు సంకలితం కాగా, ఇతర సంపుటాలలో గతి తార్కికవాదం, కారల్ మార్క్స్ మొదలయిన విషయాలపై కూడ కవితలు వ్రాశాడాయన. మైథిలీ శరణ గుప్తగారు ప్రధానంగా భారతీయ పునరుజ్జీవనోద్యమానికి చెందిన కవి.

—సి సుబ్రహ్మణ్యం
'స్రవంతి'లో

## సుసర్ల కృష్ణమూర్తి

ప్రముఖగాంధేయవాది, స్వాతంత్ర్య సమరయోధులు, 95 సంవత్సరాల వయోవృద్ధులు శ్రీ సుసర్ల కృష్ణమూర్తి గారు పెదకళ్లేపల్లి గ్రామంలో మార్చి 16వ తేదిన స్వర్గస్థులైరి. వారికి భార్య, ముగ్గురు కొడుకులు, ముగ్గురు కూతుళ్లు గలరు. గాంధీజీ ఉద్బోధలకు ప్రభావితులై ఖాదీ ఉద్యమానికి, మద్యపాన నిషేధానికి విశేషంగా తోడ్పడినారు. మరణవార్త వినగానే ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ మండలి వెంకట కృష్ణరావు వెళ్ళి అంత్యక్రియలలో పాల్గొని శ్రద్ధాంజలి ఘటించారు. శ్రీ సుసర్ల కృష్ణమూర్తిగారు నిస్స్వార్థ, ప్రజాసేవకులని, తన జీవితాన్ని

యావదాస్తిని కాంగ్రెస్ కొరకు త్యాగము చేసిన ధన్యజీవియని, స్వాతంత్ర్య సమరంలో పాల్గొని నిర్మాణ కార్యక్రమాలకు అత్యంత ప్రాధాన్యత యిచ్చిన గాంధేయవాది అని శ్రీ కృష్ణరావు అన్నారు.

—వార్తావిశేషం
'గాంధీ క్షేత్రం'

## షావుకారు జానకి

36 సంవత్సరాల క్రితం – విడుదలైన తొలిచిత్రం శంకరమంచి జానకిని 'షావుకారు' జానకిగా చేసింది. నాటి ముగ్ధ జానకికి, నేటి 'బిలకమ్మ' జానకికి మధ్య ఎన్నో భిన్న విభిన్నమైన పాత్రలలో జానకి జీవించారు. కొన్ని 'జీవించడానికి' దోహదం చేస్తే మరి కొన్ని జీవయాత్ర కొనసాగడానికి దోహదం చేస్తాయి.... తనను 'జీవింపజేసే' పాత్రల స్వరూప స్వభావాల్లోని 'సత్తా'ను గుర్తించడం, అదో సవాలుగా భావించి, ఆ పాత్రలో రాణించడానికి కృషి చేయడం, అందరూ అనుకున్న మేర కంటే ఆ పాత్ర, తద్వారా ఆ చిత్రం విజయవంతం కావడం ఆమె నటజీవితంలో ఆనవాయితీగా వస్తోంది. అందువల్లే 'అరుదైన' పాత్రల్లో 'అపురూపమైన నటనకే ఆమె పరిమితమై పోయారు. .... తన పాత్రోచితమైన 'సహజ నటన'తో సన్నివేశాన్ని రక్తి కట్టించడం కొందరికే సాధ్యమౌతుంది. ఆ కొందరిలో అగ్రశ్రేణికి చెందిన నటీమణి షావుకారు జానకి. అందువల్లే 'డా॥ చక్రవర్తి'లో Possessive Wife గా, 'బాటసారి' లో జమీందారిణిగా 'మంచి మనసులు'లో ఆంధ్ర యువతిగా, 'మంచి కుటుంబం' లో ఎనిమిది మంది పిల్లల తల్లిగా, తమిళ చిత్రాలు 'ఇరుకోడుగళ్'లో కలెక్టర్‌గా, 'పుదియపరవై' (సింగపూర్ సి ఐ డి)లో పరాజిత అయి, మద్యానికి బానిస అయిన ఆధునిక స్త్రీగా ....ఇలా ఎన్నిరకాల పాత్రలు ధరించినా, ఏ 'ఇమేజ్'కు, ఏ 'మూస'కూ పరిమితం కాకుండా, తనకో ప్రత్యేకమైన 'ఇమేజ్' ఏర్పరచుకోగలిగారు. ఆ కారణం వల్లే 'సంసారం ఒక చదరంగం' లో 'పని మనిషి' పాత్రలో ఆమెను నటించమని కోరినప్పుడు, మళ్లీ తనకు ఓ 'సవాల్' ఎదురైందన్న ఉత్సాహంతో - అంగీకరించారు. ('బిలకమ్మ')

—బికె ఈశ్వర్
'విజయచిత్ర'లో



ప్రపంచంలోని ఆర్థిక నిపుణులందరినీ వరుసగా నిలబెట్టినా ఏ యిద్దరూ ఏకాభిప్రాయానికి రారు.

—బెర్నార్డ్‌షా

ప్రతి ఒక్కరూ బుజు మార్గాన అభిప్రాయాలు వ్యక్తం చేస్తూవుంటే, ఇక మాట్లాడుకునేందుకు ఏముంటుంది?

—డిజరైలి

## మానవ ప్రగతి

### వన మూలికలు

మూడు వేల సంవత్సరాల భారత ఔషధ చరిత్రలో ప్రాచుర్యం పొందిన 'వనమూలికా వైద్యం' ఇప్పుడు ప్రపంచ వ్యాప్తంగా ప్రఖ్యాతి వహిస్తోంది. దీనికి ప్రధాన కారణం ఇతర వైద్య విధానాలవలె ఈ మూలికా వైద్యంలో అపాయకరమైన ఇతర పరిణామాలు రావుకనుక. ఆయుర్వేద, సిద్ధ వైద్య శాస్త్రం నిరపాయకరమైన సమర్థవంతమైందని తరతరాలుగా ఎరిగిన సత్యం. అయితే మొగలుల కాలంలోను, ఇస్లామిక్ రాజ్యనుల సేవార్థంగాను, 12, 13 శతాబ్దాల్లో టాబీస్, హకీమ్స్ చేత యునాని వైద్య విధానం కూడా బహుళాదరణ పొందింది. ప్రస్తుతం వనమూలికల సంరక్షణ, కొత్త వనమూలికల పెంపకం విషయంలో మనదేశం చాలా జాగ్రత్తలు తీసికోవలసి ఉంది. మన దేశాన విస్తృతంగా ఉన్న అడవులు, నదీ లోయలు, డెల్టాలు, చిత్తడి నేలల్లో ఈ మూలికల సంరక్షణ చేయపడాలి. ఈ విషయంలో ప్రకృతి విషయాన్ని కూడా దృష్టిలో ఉంచుకుని మూలికా సంరక్షణ చేయబడుతుంది. పరతంత్ర పాలన అంటించిన మోజులో విదేశీ వైద్యమైన అల్లోపతి మందులు వాడి ఏదో త్వరత్వరగా వ్యాధి నయమౌతోందని దాని వెంటపడి లేనిపోని ఇతర అపాయాలని కొని తెచ్చుకోవడం మామూలైంది. స్వదేశీ వైద్యాన్ని నిర్లక్ష్యం చెయ్యడం జరుగుతోంది. .... ఆయుర్వేద సిద్ధ వైద్యాలకు వనమూలికలు వెన్నెముకల్లాంటివి. అయితే ఖనిజాలు, లోహాలు, ఇతర ఔషధాలు కూడా ఉపయోగించబడతాయి. ఈ నాడు అనేకమంది వ్యక్తులు, సంస్థలు ఈ వనమూలికలను తమ పెరళ్లలో, తోటల్లో ప్రత్యేకంగా పెంచుతున్నారు. ఈ విషయంలో ఉత్తర ప్రదేశ్‌లోని కుమాప్ ప్రాంతంలోని కేంద్ర ఆయుర్వేద సిద్ధ వైద్య విధానాల పరిశోధనా సంస్థ, మూలికల పెంపకం, సంరక్షణ, నిల్వజేయడం, అమ్మడం వంటి కార్యక్రమాలు విస్తృతంగా చేపడుతోంది. రాజస్థాన్‌లోని అజ్మీర్ దగ్గర మంగల్ టాబ్స్ వద్ద ఒక పరిశోధనాశాల కూడా నెలకొల్పబడింది, ఇక్కడ 140

నెక్టార్ల పొలంలో కేవలం గుగ్గులు (కామిఫెరా ముకుల్) అనే మూలికలని పెంచుతున్నారు. గుజరాత్ ప్రభుత్వం కచ్ ప్రాంతంలో కూడా వనమూలికల్ని పెంచుతోంది. తమిళనాడు ప్రభుత్వం కూడా ఇప్పుడిప్పుడే వనమూలికలను పెంపకానికి ప్రాధాన్య మిస్తున్నది.

## హెలికాప్టర్లు

హెలికాప్టర్ల తయారీకి సంబంధించిన ఒక భారత - అమెరికన్ ఉమ్మడి పథకం త్వరలో మద్రాసు ఎగుమతి ప్రొసెసింగ్ మండలంలో ప్రారంభం కానున్నది. అమెరికాలో స్థిరపడిన భారతీయుడు ఎన్. నారాయణన్‌కు చెందిన 'నారాస్ ఏవియేషన్ ప్రయివేట్ లిమిటెడ్' అనే స్థానిక సంస్థ, అమెరికాకు చెందిన 'హైన్స్ ఏవియేషన్ ఇండస్ట్రీస్' సాంకేతిక సహకారంతో చేపడుతున్న ఈ పథకం క్రింద ఈ ఏడాది (1987) మధ్య భాగంలో వాణిజ్య సరళిలో ఉత్పత్తి ప్రారంభమవుతుందని భావిస్తున్నారు. ఈ భారత్ - అమెరికన్ ఉమ్మడి పథకంలో పాల్గొంటున్న అమెరికన్ సంస్థ ('హైన్స్') వైమానిక పరిశ్రమల రంగంలో 50 ఏళ్ల అనుభవాన్ని గడించి ప్రముఖ సంస్థగా పేరు పొందింది. ఈ పది లక్షల డాలర్ల పథకానికి మియామీలో గల నారాయణన్‌కి చెందిన అమెరికన్ కంపెనీ 'నారాస్ ఏవియేషన్స్' అనే అమెరికన్ సంస్థ పెట్టుబడుల ద్వారాను, బ్యాంకి రుణాల ద్వారాను ఆర్థిక సహాయం లభిస్తుంది. 'హెలికాప్టర్ల తయారీ పథకం గురించి తెలియజేసేందుకై భారతీయ సంస్థ ఇటీవల ఇక్కడ ఏర్పాటు చేసిన విలేకరుల సమావేశంలో అమెరికన్ కాన్సల్ జనరల్ జాన్ డి. స్టెంపెల్, ఈ పథకం భారత - అమెరికన్ సహకారం విలువలకు ఒక మంచి ఉదాహరణ అని పేర్కొన్నారు. ఈ ఉమ్మడి పథకం తమిళనాడుకు మరొక చక్కని వనరు కాగలదని కూడా అన్నారు. తొలిదశలో తమ సంస్థ హెలికాప్టర్ల కోసం పిస్టన్ ఇంజన్ అసెంబ్లీస్, ఎయిర్ ఫ్రేమ్స్, స్కిన్ పానెల్స్ తయారు చేస్తుందని 'నారాస్ ఏవియేషన్' అధ్యక్షులు నారాయణన్ వెల్లడించారు. ఈ పథకానికి సాంకేతిక సహకారం అందించే 'హైన్స్ ఏవియేషన్' సంస్థ తిరిగి కొనుగోలు చేసే ఏర్పాటు క్రింద తానే ఏటా 60 హెలికాప్టర్లను కొనుగోలు చేస్తుంది. ఆ తర్వాత ఆ సంస్థ ఈ హెలికాప్టర్లను ఇతర దేశాలకు విక్రయించవచ్చు. ఉమ్మడి పథకం క్రింద తయారయ్యే పిస్టన్ ఇంజన్ హెలికాప్టర్ రెండు సీట్లు కలిగి వుంటుంది. ఈ ఇంజన్‌ను ఇంతవరకు ఇండియాలో ప్రవేశ పెట్టలేదు. అతిముఖ్యమైన వ్యక్తుల ప్రయాణాలకు, అత్యవసర సహాయక చర్యలకు, నిఘా పనులకు, పంటలపై మందులు చల్లడానికి, సాధారణ రవాణాకు ఈ హెలికాప్టర్లు ఉపయోగ పడతాయి. ఈ తరహా హెలికాప్టర్లను ప్రపంచ వ్యాప్తంగా నిత్యం వినియోగిస్తున్నారు. ఇవి 17

దేశాలలో అధికారిక ఆమోదం పొందాయి. ఈ హెలికాప్టర్లను ప్రస్తుతానికి విదేశీ మార్కెట్లకై ఉద్దేశించినప్పటికీ తదుపరి దశలో వీటిని ఇండియాలో విక్రయించడానికి ప్రయత్నాలు చేస్తారు. ఈ హెలికాప్టర్ల ధర తక్కువగా వుండేందువల్ల ఇండియాలోని పారిశ్రామిక వర్గాలు, వాణిజ్య సంస్థలు వీటిని కొనుగోలు చేయవచ్చునని ప్రస్తుత సూచనల వల్ల తెలుస్తున్నది.

## డేనే కేయీ

వైద్యుడవ్వాలనుకొని విదూషకుడయ్యాడు - లక్షలాది మందిని కడుపారా నవ్వించాడు. నవ్వుల నదిలో పువ్వుల పడవలాంటి డేనీ కేయీ - హాలీవుడ్ సినీరంగాన్ని ఏలిన సుప్రసిద్ధ హాస్యనటుడు. ఆ నవ్వులు, ఆ హాస్యం ఇప్పుడు సెల్యులాయిడ్ మీద మాత్రమే మిగిలాయి. అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన అద్భుత హాస్యనటుడు డేనే కేయీ తన 74వ ఏట కాలధర్మం చెందాడు. అయిదు దశాబ్దాల తన చలన చిత్ర జీవితంలో డేనే కేయీ వైవిధ్యం గల పెక్కు పాత్రలు పోషించాడు. అతడొక అరుదైన హాస్యనటుడని 'ది న్యూయార్క్ టైమ్స్' పేర్కొంది. అఫ్ ఇన్ అర్మ్స్ (1944), వండర్ మాన్, (1945). ది కిడ్ ఫ్రం బ్రూక్లిన్ 1946)ది సీక్రెట్ లైఫ్ ఆఫ్ వాల్టర్ మిట్టీ, (1947), ది ఇన్‌స్పెక్టర్ – జనరల్

(1949), హాన్స్ క్రిస్టియన్ అండర్సన్ (1952), నాక్ ఆన్ వుడ్ (1953), వైట్ క్రిస్మస్ (1954), ది కోర్ట్ జస్టర్ (1956) లాంటి విజయవంత మైన చిత్రాలలో డేనేకేయీా నటించారు. 1950 దశకంలో డేనేకేయీా చలన చిత్ర జీవితం దెబ్బతిన్నది. అయితే అప్పుడాయన వారం వారం ఒక టెలివిజన్ ప్రదర్శనను విజయవం తంగా నిర్వహించి, పెక్కు సంవత్స రాలపాటు 'యునిసెఫ్' తరఫున ప్రదర్శన లిచ్చాడు.... ఉక్రెయిన్ నుంచి వలస వచ్చిన దంపతులకు న్యూ యార్క్‌లో 1913 లో జన్మించిన డేవిడ్ డేనియల్ కమిన్‌స్కీ (డేనీ కేయీా) తొలుత వైద్య విద్య నభ్యసిం చాలనుకొని, డబ్బు దొరికే అవకాశాలు కనుచూపుమేరలో కనిపించకపోవడం తో, ప్రయివేటు వ్యక్తులు ఏర్పాటుచేసే విందులలో ఆడి, పాడి, హాస్యోక్తులు పలికే విదూషక వృత్తిలో ప్రవేశిం చాడు. 'లేడీ ఇన్ ది డార్క్'లో 39 సెకండ్లలో 50 క్లిష్టమైన రష్యన్ పేర్లను పలికి అందరిని పలకరించ డంతో హాలీవుడ్‌లో మంచి గుర్తింపు లభించింది. డేనీ కేయీా 1963 - 1967 మధ్య విస్తృతంగా టి.వి. కార్యక్రమాలిచ్చాడు. 'ది డేనీ కేయీా షో' అనే అతడి సుప్రసిద్ధ టి.వి. కార్య క్రమం అనేక అవార్డులు పొందింది. హాస్యం సంగతిఅలావుంచి, డేనీకేయీాకి దిక్కులేని పిల్లలపట్ల ఎంతో ప్రేమ. 'యునిసెఫ్' తరఫున 1950 నుంచి వరమాన దేశాలలో పెక్కు ప్రదర్శన లిచ్చాడు. 1975లో 'యుఫ్‌సెని' తరఫున 65 నగరాలలో ఏకబిగిన ప్రదర్శన లిచ్చిన సందర్భంగా ఆయన తన సొంత జెట్ విమానంలో 17,000 మైళ్లదూరం ప్రయాణించి కొత్త రికార్డు నెలకొల్పి 'గిన్నీస్‌బుక్' లో సానం సంపాదించుకున్నాడు.

(భాస్కరన్ థామస్)

## కోస్ట్ గార్డ్

డమన్‌లోని తీరరక్షణదళం (కోస్ట్ గార్డు) ఒక గొప్ప ముందడుగు వేయ నున్నది. తీరప్రాంతసిఘా(సర్వైలేన్స్) కోసం ప్రత్యేకంగా సమకూర్చబడిన ఆధునిక పరికరాలను కల్గిఉన్న రెండు డోర్నీయర్ విమానాలు ఈ ఎయిర్ స్టేషన్ ముఖ్య కేంద్రంగా ఉంటాయి. కోస్ట్‌గార్డ్‌ను భారతదేశ సముద్రతీర ప్రాంతాల ప్రయోజనాలను కాపాడటం కోసం, ఒక రక్షకదళం 1978 అగస్ట్ 19వ తేదీన ఏర్పాటు చేయ బడింది. గత సంవత్సరం ఈ సర్వీస్ గణనీయమైన ప్రగతిని సాధించింది. భారతదేశపు 28 లక్షల చదరపు కిలోమీటర్ల ఎక్స్‌క్లూసివ్ ఎకనిమిక్ జోన్‌పై మనసర్వాధికారం కాపాడటం కోసం వివిధ శాంతియుత సముద్రతీర బాధ్యతలను నిర్వహించడం కోసం ప్రధానంగా ఈ కోస్ట్‌గార్డ్ ఏర్పాటు చేయబడింది. సజీవ నిర్జీవ సంరక్షణ, సముద్రావరణ రక్షణ, పరిరక్షణ, సముద్రకాలుష్య నివారణ, నియంత్రణ, స్మగ్లింగ్ కార్యకలాపాల నివారణకు, కస్టమ్స్‌కు సహాయం,

సముద్ర ప్రాంతముల నుండి రక్షించడం, సముద్ర పరిశీలన, సముద్రంలోని మన కట్టడాల పరిరక్షణ మొదలైన బాధ్యతలను ఈ సర్వీస్ కలిగిఉంది. గత కొద్ది సంవత్సరాలలో ఒరిస్సా తీరంలోని గ్రేట్‌రాడ్లే సముద్ర తాబేళ్ళ వంటి వివిధ నశించిపోతున్న, ప్రమాదంలో ఉన్న సముద్ర జీవ జాతుల పరిరక్షణకు సహాయపడింది. ఈ విధమైన బాధ్యతలను సామర్ధ్యవంతులు నిర్వహించడానికి విమానాలు, నౌకలూ అవసరం. ప్రభుత్వం ఈ అవసరాలను గుర్తించి సర్వీస్ పెరుగుదలకు, వివిధ రకాల విమానాలను నౌకలను సర్వీసులో ప్రవేశపెట్టడానికి, వాటికి సహాయకారిగా తీరప్రాంతంలో సరైన మౌలిక సదుపాయాలను కల్పించడానికి ఒక దీర్ఘకాలం ప్రణాళికలను రూపొందించింది. 200 నాటికల్ మైళ్ల వరకు ఉన్న ఎక్స్‌క్లూసివ్ ఎకనమిక్ జోన్ పరిరక్షణకు గస్తీ నౌకలను ప్రవేశపెడతారు. వీటిని 'పనిచేసే గుర్రాలు' గా పరిగణిస్తారు. వీటిపైన ఉండే చేతక్ హెలికాప్టర్ వలన వీటి నిఘా సామర్ధ్యం పెరుగుతుంది. కోస్ట్‌గార్డ్ ప్రస్తుతం ఏడు సముద్రతీర గస్తీ నౌకలను కలిగి ఉంది. ఇందులో నాల్గింటిని జపాన్ నుండి దిగుమతి చేసుకొనగా, యంత్ర సామాగ్రితో కలకత్తాలో నిర్మించాడు. త్వరలో మరికొన్ని నౌకలు ఈ కోస్ట్‌గార్డ్‌లో ప్రవేశింప నున్నాయి.



# కొత్త పుస్తకాలు

'భక్తి విశ్వాసాల ముసుగులో' –. రచన: పరకాల పట్టాభిరామారావు. ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుజ్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు - 500 001. వెల: రు 3-00.

అన్ని మతాలవారు, ఎటువంటి మత విశ్వాసాలు లేనివారు, హేతువాదులు, సంశయ వాదులు, నాస్తికులు అందరికీ భావ స్వాతంత్ర్యం వుంది మన భారత రాజ్యాంగంలో. జాతీయ స్వాతంత్ర్య పోరాటకాలంలో ఒక పక్కకు నెట్టబడిన మూఢభక్తి వేరువేరు విధాల వింత రూపాలతో వెర్రితలలు వేస్తున్నది. ఈనాడు. కాపిటలిజమ్ తన స్వార్థం కోసం, మత మౌఢ్యాన్ని ఎలా ఆశ్రయించేదీ సోదాహరణంగా చెబుతున్నారు రచయిత ఈ చిన్న పుస్తకంలో. మతం నల్లమందు, అని ఎవరూ అనడం లేదు; మత మౌఢ్యం నల్ల మందు. అధిస్వార్థ పరుల తెలిసీ తెలియని కుట్రతో మతోన్మాద మవుతోంది. 1980 ఫిబ్రవరి 29 వ తేదీన రాజస్థాన్‌లో 62 ఏళ్ల మహిళ కొత్త పెళ్లికూతురిలా అలంకరించుకు వందలాది ప్రజల సమక్షంలో భర్త చితిపై సహగమనం చేయడం; వర్షం పడేందుకు వరుణదేవుని ప్రీతి కోసం ఉత్తర ప్రదేశ్‌లోని కొన్ని గ్రామాలలోని స్త్రీలు నగ్నంగా పొలం దున్నడం; 1982 అక్టోబరులో తమిళనాడులో ఒక వాయులీన విద్వాంసుడు 'అమృతవర్షిణి' రాగాలాపనతో వర్షం కురిపిస్తాననడం; మహారాష్ట్రలోనిఒక దురాశాపరురాలు 'లంకెబిందెల' కోసం ఆరుగురు కన్యల రక్తంతో నేల తడిపించడం; బీహారులోని ఒక మంత్రిగారు నల్ల మేకల రక్తంతో స్నానం చేశారనే వార్త – యిలాటివి ప్రజానీకాన్ని మరింతమౌఢ్యంలో ముంచుతున్నాయి. వీటికి తోడు రాజకీయ జోస్యులు, దైవాంశ సంభూతులూను, ధీరేంద్ర బ్రహ్మచారి, సదాచారి ఎందువల్ల బద్ధ విరోధులయారు? బాబాలు, రాజనీష్, మహేష్‌యోగి, ఇస్కాన్, ఆనంద మూర్తి, పదమూడు అంతస్తుల రుషీకేష్ ఆలయ నిర్మాత కైలాసానంద్, దివ్యజ్యోతి బాల యోగీశ్వర్ - వీరందరికీ ఈ ధనరాసులు ఎలా వస్తున్నాయి, ఎక్కడ నుంచి వస్తున్నాయి? ఈ మోడరన్ బాబాలు తమ శిష్యకోటీని ఎటువంటి మానసిక బానిసత్వంలో వుంచగలుగు తున్నారు?–

యిలాటివన్నీ పరకాన పట్టాభి రామా రావు చక్కగా తర్కించారు, వివరించారు. కరదీపిక వంటి కరపత్రమిది.



ఇందుప్రియ - నవల. రచన: పాటిబండ్ల విజయలక్ష్మి. ప్రచురణ: శ్రీ విజయభారతీ పబ్లికేషన్స్, 7, పొలట్ శంకరన్ రోడ్, మద్రాసు - 600 034, వెల: రు 25-00.

"తెలుగుజాతి గౌరవం పెంచిన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారక రామారావుగారికి చంద్రునికో నూలుపోగులా అంతులేని అభిమానంతో అందించే చిరుకానుకే ఈ నా 'ఇందుప్రియ' "- అని అంటున్నారు రచయిత్రి.

ఇందుప్రియ, వసుధ కాలేజీమేట్స్. వసుధ, గౌతమ్ అనే అసిస్టెంట్ డైరక్టరుని పెళ్లిచేసుకుంటుంది; ఇందుప్రియ సినిమాతార అవాలనుకుంటుంది, అవుతుంది. తనకెంత పేరు ప్రఖ్యాతులు వచ్చినప్పటికీ, కాలేజీ రోజుల్లో ప్రేమించిన కృష్ణనే మనసులో నిలుపుకుంటుంది. ఇందుప్రియ పొందుకోసం, హీరో శ్రీహర్ష, అంకుల్ నారాయణరావు, డైరక్టర్ గౌతమ ఆమెని యిరుకున పెడతారు. కాని, విధి ఆమెని కాపాడుతుంది; ప్రియాదేవి అనే ఒక పెద్దతార ఆమెకి అండగా నిలుస్తుంది. ఊటీలో, కాశ్మీరులో, సింగపూర్‌లో ఆమెపై అత్యాచార ప్రయత్నం జరగ్గా, ఆమె తెగింపూ విధిబలీయతా ఆమె కన్యత్వాన్ని కాపాడుతాయి. సినిమా ప్రపంచం గురించిన నవల గనక సినిమా ట్విస్ట్ ఒకటి ఉంది; అది సమీక్షలో చెప్పడం న్యాయం కాదు.

మనసుకి నచ్చిన విషయాలు చదువరులకి హాని కలిగించకుండా చెప్పడమే ఎప్పటికీ మంచిదనీ, నన్నయ నాటి లోకజ్ఞతనే నేడు సామాజిక స్పృహగా పేర్కొంటున్నామనీ అంటారు పాటిబండ్ల విజయలక్ష్మి.

—క్షీరసాగరమ్

## 'నివేదిత' సమీక్ష

(87 ఫిబ్రవరి సంచిక తరువాయి)

1902 లో వివేకానందుడు మరణిస్తాడు. జాతీయ పోరాటంలో, కాంగ్రెసు కార్యకర్తలతో నివేదిత జీవితవిధానం పెనవేసుకుంటుంది. బేలూరు మఠంవారు ఆమెకూ తమ కార్యకలాపాలకూ సంబంధం లేదని సున్నితముగా ప్రకటిస్తారు. వివేకానందుడూ 'దేశభక్త సన్యాసి' యే. నివేదిత మౌనంగా ప్రార్థిస్తుంది. "స్వామీ, జీవిత పర్యంతం నా కర్తవ్యమూ, ప్రవర్తనా నీ యిచ్ఛానుసారంగా నేకొనసాగే విధంగా దీవించు, నా యిష్టప్రకారంగా కాదు." - వివేకానందుని అడుగుజాడల్లోనే 'భారతమాత' సేవకు పూనుకొన్నది. రాజకీయాల్లో పాల్గొంటూనే దేశప్రజల విముక్తి వారి అంతరంగాల్లో ఏకైక ధర్మ సంస్థాపన ద్వారా జరగాలనే ఆమె కోరుకున్నది. స్వశక్తిమంతమైన హిందూ మతమునకు యీ శక్తి వున్న

హిట్! సూపర్ హిట్! అందరినోట ఇదే మాట! తప్పక చూడండి



ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్

# ప్రెసిడెంటుగారి అబ్బాయి

నిర్మాత: ఎ.వి.సుబ్బారావు దర్శకత్వం: తాతినేని రామారావు

దని ఆమె గట్టిగా అభిప్రాయపడింది.

బెంగాలు క్షామం సమయంలో కరువు ప్రాంతాల్లో పర్యటించి నిధులు వసూలు చేసింది. "జాతీయజీవనంలో వివేకానందుని జీవితము, సేవల ప్రాముఖ్యం", "భారతీయ ఐక్యత", "అధునిక విజ్ఞానం - భారతమేధ", "భారతీయ స్త్రీత్వము", "దేశవిభజన - వైస్రాయి" మొదలైన అనేక విషయాల మీద వుపన్యసిస్తూ దేశమంతటా తిరిగింది.

లార్డ్ కర్జన్ ఒక వుపన్యాసంలో "భారతీయులు చపల చిత్తులూ నీతి లేని వారూ" అని నిందిస్తే, బాలా ఘాటుగా, ధైర్యంగా ఆయన్ని విమర్శించింది. బుద్ధగయలోని బౌద్ధమందిరం బౌద్ధులకు మాత్రమే చెందినది కాదనీ, అది హిందువులందరికీ పవిత్ర యాత్రాస్థలమనీ వాదించి ప్రభుత్వాన్నీ ప్రజలనూ వప్పిస్తుంది. స్వదేశీ వుద్యమంలో వస్తువుల వుత్పత్తికి ఆర్థికంగా నైతికంగా తోడ్పడి ఎన్నో పరిశ్రమలు స్థాపించడానికి కారణ భూతురాలవుతుంది.

జాతీయ కళా సంవిధాన మొకటి వుద్భవించాలని కలలుగన్నది. అందుకే ఆమె చివరి రోజులలో నందలాల్ బోస్, అవనీంద్రనాథ్ టాగూర్ వంటి వారు ఆమె వద్దకు తరచు వస్తుండే వారు.

విప్లవకారులతో పరిచయం కలిగాక ఆమె సానుభూతి సహకారాలు పూర్తిగా వారికి అందజేసింది. "యుగంతర్" పత్రికతో, ఆ సంపాదకునితో ఆమె పరిచయం పెరిగాక, బ్రిటిషు ప్రభుత్వం దృష్టిలో ఆమె అనుమానాస్పదురాలయింది.

అనుయాయులంతా ఆమెను విదేశాలలో వుండి యిండియాకు చేయవలసిన దెంతో వున్నదని వప్పిస్తారు. అల్లాగే ఆమె యింగ్లాండు, యూరప్ లలో వుండి భారతదేశంలో నిషేధింపబడిన పత్రికల ప్రచురణకి తోడ్ప

1909లో మారువేషంలో యిండియాకు తిరిగి వస్తుంది నివేదిత. అత్యాధునికంగా దుస్తులు ధరించిన పాశ్చాత్య వనితను నివేదితగా ప్రభుత్వంగుర్తించలేకపోయింది. రెండు ఏళ్ళ పాటు స్వాతంత్ర్య సమరంలో నిర్విరామకృషి చేస్తుంది. విప్లవకారులెందరో అరెస్టు అయారు - అరవింద ఘోష్ పాండిచేరి వెళ్ళిపోయారు.

అలసిపోయిన నివేదిత బాహ్య - ప్రపంచంతో క్రమక్రమంగా బంధనాలు విసర్జించడం ఆరంభించింది. ప్రశాంతంగా, ఏకాంతంగా గడుపుతూ, వేదపఠనం వింటూ వుండేది. దైవసాక్షాత్కారం కోసం తపన కూడా తగ్గిపోయింది.

జగదీశ్ చంద్రబోసు కుటుంబంతో డార్జిలింగ్ వెళ్ళి, స్వల్పమైన అస్వస్థతకు లోనయి సునాయాసంగా తన 44వ ఏట మరణిస్తుంది. బేలూరు మఠం నుండి పంపిన పళ్ళబుట్టలోనుండి తన గురువు ప్రసాదాన్ని ఆఖరిసారిగా స్వీకరించి కన్నుమూస్తుంది. వివేకానం

# చాంద్రా రచనలు

నేటి విలువలు
దూరాన్ని జయించిన మానవుడు
ఛార్లెస్ స్టీన్ మెజ్
కథానికలు
జీవనమార్గం
ఎలినార్ రూజ్‌వెల్ట్
తొలి పాఠాలు
ప్రేమగాథ
హెలెన్ కెల్లర్
డా॥ మేరి వెర్షిస్
నేల - నీరు
మహా నగరంలో
జీవితం
నవచైనా
ప్రతి గురువారం
ఆరు కథలు
చెట్లు
మరొక ఆరు కథలు
ఈ నాగరికత
నాలుగు రోడ్లు
అణుశక్తి
బాలరాజ్యం
గ్రామవైద్యుడు
సాహస యాత్ర
అంతేనా
కాఫీ మానెయ్యడం

పరిచయం చేసిన పుస్తకాలు
అన్యాయం
ఆఖరి కోరిక
ఎక్కడికి కమలా?
భానుమూర్తి భార్య
రాధ నవ్వింది
కొత్తలోకాలు
కొన్ని గ్రంథాలు
సీతతో సినీమాకు
ప్రజానాయకుడు ప్రకాశం
నట్టింట దీపం
మాంగుళూర్ మెయిల్
మహాబలిపురం
మనకీ ఒక కారు
సీతా ఫలాలు
భాష
పూసల మేడ
శివరావు
కలడోలేడో
మావో పాలనలో
చైనాలో మైనారటీలు
అమెరికా
జులై నాలుగు
వరదల్లో వాంగ్
మాతా భూమాతా
బీమలబారు

**వీటిలో ఏ ఒక్కటీ ప్రస్తుతం లేవు. చదవాలనుకున్న వారు మీకు చేరువలోవున్న లైబ్రరీలో దొరికితే చదవండి.**

మని ఆత్మ పుత్రిక, భారతదేశపు ప్రియతమ సంతానం.

"ప్రేమను నలుదిక్కులా పంచి పెట్టడమే తప్ప బదులుగా ఏదీ ఆశించకూడదు" అని నమ్మి అది పూర్తిగా ఆచరణలో అనుసరించింది, నివేదిత.

లేమి, పవిత్రత, బ్రహ్మచర్యం, వినయశీలత అనే ప్రమాణాలతో తన జీవిత గమనాన్ని నిర్దేశించుకున్నది. ఆమె స్వయంగా జ్ఞానసిద్ధి కలదైనా వివేకానందుని అవార్యత్వంలో అది మరింత వుద్దీప్తి చెందింది.

లైజెల్ రేమండ్, నివేదిత చరిత్రను ఫ్రెంచిలో రచించి 1950 లోనే ముద్రించారు. ప్రస్తుత గ్రంథం దానిని సవరించి చేసిన అనువాదం. 374 పేజీలు సుదీర్ఘంగా సాగిన యీ రచన కుతూహలంతో చదివింపచేస్తుంది.

ఆకాలంనాటి కలకత్తా సమాజం, సాంఘిక వాతావరణం, బేలూరు మఠం సన్యాసుల వైఖరులూ, నివేదిత తన కేథలిక్ మత విశ్వాసాలు ఎంత వరకు విసర్జించింది అనే విషయాలు రచయిత్రి అత్యంత జాగరూకతతో చిత్రించడం వల్ల పఠితల మనసుల్లో కొంత అస్పష్టత ఏర్పడుతుంది.

ఆమె రాజకీయాల్లో ప్రత్యక్షంగా పాల్గొనడం వివేకానందుడు ఎదురు చూడని పరిణామంగా భావించాడా అన్న విషయంకూడా సందిగ్ధంగా వది లేస్తారు రచయిత్రి. అయితే నివేదిత యీ విషయంలో యీవిధంగా భావించి నట్లు ఒక లేఖలో తెలుస్తుంది.

'స్వేచ్ఛ నాకెంతో ప్రియమైనది. నేను ౼ర్తిగా హిందూ మతానికి, అక్కడి స్త్రీలకు, పిల్లలకు చెందిన దానినే. అయితే యిప్పుడు ప్రజల రాజ కీయ అవసరాలు కూడా నేను గుర్తించ గలుగు తున్నాను........ స్వామి నాలో వెలిగించిన భావాలేకాక యింకా ఎన్నో నాలో వున్నాయి....

నివేదితలోని దైవభక్తి ఎక్కువదా? ఇండియా పట్లగల ప్రేమ ఎక్కువదా? ఆధ్యాత్మిక చింతన ఎక్కువదా?.... అదొక త్రివేణీ సంగమ మనిపిస్తుంది.

—సరోజినీ ప్రేమ్‌చంద్



## ఈ మధ్య అందినవి

'నాలోని నాదాలు' - కవితలు. చిల్లర భవానీదేవి, హైదరాబాదు - 661 .... రు 6-00.

సౌరభ నీరాజనాలు - Fragrant Tributes — కవితలు. బెజవాడ గోపాలరెడ్డి. ఆంధ్రసారస్వత పరిషత్తు, హైదరాబాదు - 1 .... 10-00.

మానవతా శిఖరము - కవితా సంపుటి. వాసా ప్రభావతి. రాజధానీ ఆర్ట్ థియేటర్స్, హైదరాబాదు -20 .... రు 12-00.

నీరాజనం - కవితలు. జయశ్రీ సారథి, నిషి గ్రంధ ప్రచురణలు, సికింద్రాబాదు - 25 .... రు 3-00.

Atrocities on Women — Malladi Subbamma. English Translation - M. V. Ramamurthy Malladi Publications, Hydera - bad- 28. Price Rs. 30/-

సమస్యలు - సంస్కరణలు. మల్లాది సుబ్బమ్మ; మల్లాది సుబ్బమ్మ ట్రస్ట్ హైదరాబాదు - 28 .... రు 25-00.

మతసమాజాలు — మహిళలు. మల్లాది సుబ్బమ్మ, మల్లాది పబ్లికేషన్స్, హైదరాబాదు - 28 .... రు 60-00.

ఆంధ్రప్రదేశ్‌లో మహిళోద్యమం. మల్లాది సుబ్బమ్మ. మల్లాది పబ్లికేషన్స్, హైదరాబాదు - 28 .... రు 25-00.

సహృదయులైన మిత్రుల మధ్య సంభాషణలు — నొవాస్తి వార్తా సంస్థ; అమెరికా సామ్రాజ్యవాదం గురించి లెనిన్ — వాక్తర్ ఫిలతోవ్; సోషలిస్టు సమాజంలో ప్రజా సంక్షేమం - విక్తర్ క్లవ్‌దియంకో; సోవియట్ యూనియన్‌లో 12 వ పంచవర్ష ప్రణాళిక - లియొనిడ్ డనీలవ్ .... పై నాలుగూ సోవియట్ సమాచార కార్యాలయం, మద్రాసు-17.

శ్రీమద్భగవద్గీత. మనోహరఅప్పారావు. యన్ ఐ నెట్‌వర్క్ సర్ డెవలెప్‌మెంట్ సర్వీస్, మద్రాసు - 6.... రు 50-00.

చీకటిలో చిరుదీపం - నవల. యద్దనపూడి సులోచనారాణి. శ్రీ మహలక్ష్మి బుక్ ఎంటర్‌ప్రైజస్, విజయవాడ-2.... రు 25-00.

అందుకున్న పుస్తకాలన్నీ గాకపోయినా కొన్నిటి సమీక్షలు ముందు ముందు సంచికలలో వెలువడుతాయి.

మన అలవాట్లు మనం చెప్పినట్లు వింటాయని బడాయి పలుకుతాం. కాని ఆ గొలుసులు తెంచవలసి వచ్చినప్పుడే, అవి ఎంత బిగుసుకు పోయినదీ తెలుస్తుంది.

లాటరీలు, పోటీ పందాలు ఎన్ని తమాషాలు ప్రకటించినా రెండూ రెండు ఎప్పుడూ నాలుగే అవుతుంది.

## మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటాయనుకొనే 'జోక్స్' నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ప్రచురణ నిమిత్తం పంపే రచనలతోబాటు పోస్టుబిళ్లలు అతికించిన పొడుగుకవరు వుంటేకాని అంగీకారం కానివి వెనక్కి పంపడం సాధ్యం కాదు. మా ఊళ్లో 'జ గ తి' దొరకడం లేదనేవారికి ఒక్కటే మనవి - చందాదారులుగా చేరమని! రెండు సంవత్సరాలకి అంటే 24 సంచికలకు నలభై అయిదు రూపాయిలు.

JAGATI - Monthly, 2, Kutchery Road, P. B. 2922, Madras-4

సీరియల్

# భ్రమర గీతం

అచ్యు  వలి




జరిగిన కథ : రామజోగి పంతులు మనుమరాలు భ్రమర, చలపతితో స్నేహంగా వుండటం భ్రమర అక్క గార్లయిన సుగుణ, సుమనలకు అంతగా నచ్చదు, తాతగారు పట్టించుకోరు; స్వతంత్రంగా ఆలోచించే భ్రమర లెఖ్ఖ చేయదు.... ఇక చదవండి.

"నిజంగా ఏమీ లేదండీ. తను ఏదేదో కబుర్లు చెబుతూ వుంటుంది, ఒకొక్కప్పుడు చెస్ ఆడుకుంటాము. ఆట పూర్తయ్యే సరికి పదకొండూ పన్నెండు అయిపోతూవుంటుంది. ఇంక నిద్ర వచ్చేస్తూందని పడుకుండి పోతుంది. నిద్రపోయేదాన్ని వెళ్ళమనటం ఎందుకని నేనూ అక్కడ్నే చాప వేసుకుని పడుకుంటున్నాను" అన్నాడు భయం భయంగా.

"చూడు, చలం, నీవు మాకు చిన్న పిల్లాడివే కాని లోకానికి కాదు. పైగా మీ ఇంటిలో అద్దెకు దంపతులున్నారు. రాత్రిళ్ళు ఒక స్టూడెంటు కుర్రాడి రూంలో భ్రమర ఊరికే ఆడుకుని ఆడుకుని అలసిపోయి నిద్ర పోయిందంటే ఎవ్వరూ నమ్మరు. నీవు మా కళ్ళకి, భ్రమర కళ్ళకి చిన్న పిల్లాడిలాగానే వుంటావు."

"ఇంక రావద్దని చెబుతానులెండి" అన్నాడు చలపతి.

"అల్లా చెప్పమనటం లేదు. కలసి మెలసి వుంటున్నప్పుడు ఎవరికీ మాట రానివిధంగా నడుచుకోవాలి. భ్రమరకి వచ్చిన లోటు ఏమీలేదు. దానికి అందం, తెలివితేటలు వున్నాయి. ధైర్యసాహసాలున్నాయి. నీకు అందం తెలివివున్నా పిరికితనం వుంది. మగ పిల్లలకి పిరికితనం వుంటే జీవితంలో సుఖసంతోషాలు దక్కవు" అన్నది సుమన.

చలపతికి ఈ మాటలన్నీ ఏమిటో అర్థంకావడం లేదు. సుమనకి సుగుణకి ఈ ఆరాలెందుకు? చెల్లాయి మీద ప్రేమ వారికి ఎక్కువగా వుందా? లేక, జలసీయా? ఛత్! ఈ గొడవలన్నీ తనలాంటివాడికి కాదు. మస్తుగా ఆస్తిపాస్తులుండి, కార్లలో సరదాగా షికారుగా వచ్చి చదువుకునే కాలేజి స్టూడెంట్లకి! తను ఫైనలియర్ ఎగ్జామ్స్ బాగా వ్రాయాలి. మంచి మార్కులు తెచ్చుకోకపోతే పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సు మాట తలుచుకోవటానికి అర్హత వుండదు. కనీసం పోస్టుగ్రాడ్యుయేషన్ అయినా కాకపోతే ఉద్యోగం మంచిది

దొరకదు. ఇంక భ్రమర గురించి ఆలో చనలు మానివేయాలి. కొంచం మనసు తేలిగ్గావుంది చలపతికి. క్రిస్మస్ సెలవు లకి మైలవరం వెళ్ళిపోయాడు. చల పతికి మైలవరం చాలా సుఖంగా వుంది. పెద్ద మామిడి తోటలో మూలగా వుంది బంగాళా పెంకుటిల్లు. వూరికి రెండు మైళ్ళ దూరం వుంటుంది ఆ తోట! తోట చుట్టూరా కంచివిత్తనం చెట్లు వేయించాడు లక్ష్మణరావు. అవి దట్టం గా ఎలిసిపోతూ వుంటాయి. కొడ వలితో చక్కగా ఒకే ఎత్తులో వుండే టట్లుగా కోస్తూవుంటాడు.ఆకొమ్మలన్నీ ఒకవారగా పేర్చి ఎండపెట్టి వుంచు కుంటారు. వంటచెరకుకు ఎంతో బాగా ఉపయోగపడతాయి. ఇంటి చుట్టూరా కొంచం మేర దడికట్టించాడు. పెరటి నిండా కూరగాయల పాదులుపెట్టాడు. కొత్తగా తోటలో జీడిమామిడి మొక్క లు, సరుగుడు మొక్కలు వేయించాడు. లక్ష్మణరావంటే ఊళ్ళో అందరికీ అభిమానం ఏర్పడింది. అందరికీ ఉప కారం చేస్తాడు. ఎవరికే పని కావలసి వచ్చినా నమ్రతగా లక్ష్మణరావు చేసి పెడతాడు. తన తోటలో కాసిన కూర గాయలు తమ నిత్యావాడకానికి కొన్ని వుంచుకొని మిగిలినవన్నీ వూళ్ళో తెలు సున్న వాళ్ళకి పంచిపెట్టేవాడు. చల పతి వచ్చినప్పుడల్లా బస్తాడు కూర గాయలు రామజోగిపంతులుకి తెచ్చి ఇచ్చేవాడు. నవనవలాడే ఆ కూర గాయలు చూస్తూంటే రామజోగిపంతు లుకి ప్రాణం లేచివచ్చేది.

"చూసావా, మీరా! ఎంతయినా లక్ష్మణరావు యోగ్యుడు. విశ్వాస పాత్రుడు. ఈ కూరగాయలన్నీ అమ్ము కుంటే ఎంత లేదన్నా ఇరవయిరూపా యలు వస్తాయి. ద్రవ్యలోపంలో బాధ పడుతున్నా సొమ్ము కూడవేసుకుందా మనే లోభత్వం లేదు. ఎప్పుడు చల పతి వచ్చినా ఏదోవకటి ఇచ్చి పంపు తూనే వుంటాడు" అన్నాడు సంతో షంగా.

"అవును తాతగారూ చలపతి కూడా బుద్ధిమంతుడు. చదువేమిటో లోకవేమిటో అతని గొడవ అతనిదే!" అంది మేరిలిన్.

సంక్రాంతి సెలవుల్లో బాగా చదువు కోవాలి అని అక్కడే వుండిపోయాడు చలపతి.

"ఏరా నగరం వెళ్ళవా? సెలవలు అయిపోయాయిగా" అన్నాడు లక్ష్మణ రావు. జనవరి రెండు ఆదివారం అయింది. మూడో తారీకున కొడుకు హడావిడి పడకపోవటంతో అడిగాడు.

"ఈవారం ఇక్కడ్నే వుండిపోతాను నాన్నా! అటెండెన్స్ లేకపోయినా ఫరవాలేదు. చదువుకోవాలి. ఏకంగా పండుగ అయినాక వెళ్ళతాను" అన్నాడు. తోటంతా తిరుగుతూ హాయిగా విశ్రాంతిగా గడుపుతున్నాడు. ఒక్కొక్కపుడు ఒక ఆలోచన వచ్చేది "అసలు ఈ చదువెందుకు? ఈ తోటా అదీ కాపలా కాస్తూ, కూరగాయలు పండించుకుంటూ హాయిగా వుండ వచ్చును. తోటమీద బోలెడు ఫల సాయం వస్తుంది. ఇల్లు ఎంతో పెద్ద

వెగా వుంది. సుఖంగా రోజులు గడు స్తాయి. కాని చటుక్కున ఈ ఇల్లూ వాకిలీ అన్నీ పంతులుగారివని జ్ఞాపకా నికి వచ్చేది. పంతులుగారు వున్నన్ని రోజులు ఈ తోట అదీ కాపలాకి తమని ఈ ఇంట్లో వుండనిస్తారు. తాత గారు హరీమన్న మర్నాడు కొడుకులు, కూతుళ్ళు, మనుమలు మనుమరాండ్లు అందరూ పోగయి అన్ని వాటాలు వేసుకుంటారు. అప్పుడువాళ్ళల్లోవాళ్ళే ఈ తోటకి హక్కుదార్లు అవుతారు. ఇన్ని రోజులు తమ ఆస్తిపాస్తులు జాగ్రత్తగా కాపాడినందుకు అర్థోపర్థో ఇచ్చి కృతజ్ఞతలు తెలియ చేస్తారు. అప్పుడు తల్లి తండ్రి చెల్లెళ్ళు అందరూ తమ ఇంటికి వచ్చేస్తారు. అందుకని తను ఈ అండ వుండగానే బాగా చదువుకోవాలి. వీలయినంత పెద్ద ఉద్యోగం సంపాదించుకోవాలి. తల్లి తండ్రులని చెల్లాయిలని ఒక ఒడ్డుకి చేర్చాలి. తండ్రి పెద్దతనంలో నిత్యమూ అర్థిక వనరులు ఎల్లా సమ కూరుద్దామా అనే ధ్యాసకు స్వస్తి చెప్పి కొడుకు నీడలో ఏ రామాయణమో చదువుకుంటూ గడిపేలాగుండాలి. చెలెళ్ళకి మంచి సంబంధాలు చూసి పెళ్ళిచేయాలి. తల్లి మంచి పట్టు చీరలు కట్టుకుని తిరగాలి. ఇవి అన్నీ జరగాలంటే ముందు తను బాగా చదువు కోవాలి. ఈ తోట ఈ ఇల్లు ఎంత బాగావున్నా ఇవి తమవి కావు. ఎప్పుడో ఒకప్పుడు తాము ఇవి అన్ని వదలి వెళ్ళిపోవలసి వస్తుంది - అనుకున్నాడు. పండుగ రేపనగా అనసూయ బోలెడు




భూమి వయసు 200 కోట్ల సంవత్స రాలని అంచనా, ఒకప్పుడు హిమాల యాలు సముద్ర గర్భంలో ఉండే వంటారు. అప్పటికింకా నేలమీద జీవ రాశి జనించలేదు. అమెరికా యూరప్ ఇండాలు ఒకప్పుడు ఇప్పటికంటె వెయ్యి మైళ్ళు చేరువగా భారతదేశం భూమధ్య రేఖకు మధ్యగా ఉండేవి. ఆసియా ఆఫ్రికాఖండాలకు నేలమార్గం ఉండేది.

పిండివంటలు చేసింది. మునుపు చేతి నిండా సామాన్లు వుండేవి కావు. తోట, ఇల్లు బాగా అమిరాయి కదా అని ఒక చిన్నగేదను కొనుక్కున్నారు. ఒక పూట పాలు ఇంట్లో ఖర్చు బెట్టుకున్నా రెండోపూట పాలు వూళ్ళో వాళ్ళి చ్చేవారు. ఆ డబ్బు చేతిలో ఆడటంతో ఇంట్లోకి కావాల్సిన సామాన్లు సమృ ద్ధిగా కొనుక్కునేవారు. నేతి సున్ని వుండలు, కారప్పూస, చేగోడీలు చేసి డబ్బాల్లో దాచింది. పండుగనాడు

పులిహోర, బొబ్బట్లు చేసింది. ఉదయం ఎనిమిది గంటలు అవుతుంటే టక టక మంటూ వచ్చేసారు మేరిలిన్ సంతానం. వెనక్కాల రామజోగిపంతులు గారు కూడా వచ్చారు. తాతగారు రావటంతో లక్ష్మణరావు, చలపతి తహ తహ లాడుతూ వాళ్ళకి కావల్సిన సౌకర్యాలు చేసారు. తోటంతా చూపెట్టాడు చలపతి. శీల, మాల చక్కగా పట్టు, పరికిణీలు కట్టుకుని జాకెట్లు వేసుకున్నారు. జుట్టు దువ్వి గట్టిగా బిగించి జడవేసుకున్నారు. చక్కటి తెల్లటి పాల రంగుతో వున్న పిల్లలేమో కళ్ళనిండా కాటుక బొట్టు పెట్టుకుంటే ఎంతో వద్దికగా ముగ్ధమనోహరంగా వున్నారు. వసుధ విమల వాళ్ళ వెనకాతల తోకల్లా తిరిగారు. సుగుణ సుమనలు కూడా చీరలు కట్టుకున్నారు. భ్రమర పెద్ద పెద్ద ప్రింటులో పూల చెట్టున్న లుంగీ కట్టుకుంది. హాఫ్ హాండు బుష్ షర్టు వేసుకుంది. జుత్తంతా దువ్వి, కుదుట్లో రబ్బరు బాండు పెట్టేసింది. నడుంవరకూ మెత్తగా ఎగురుతూంది ఆజుట్టు. చలపతి భ్రమరతో ముఖాముఖీగా మాట్లాడలేక పోతున్నాడు. వాళ్ళందరికీ భోజనాలు వడ్డించటంలో తల్లికీ చెల్లెళ్ళకి సాయిపడ్డాడు. మధ్యాహ్నం అందరూ విశాలమయిన గదిలో జంబుఖానాలు పరుచుకుని పడుకున్నారు. వసుధ విమల 'సంది గొబ్బిళ్ళు పెట్టుకుంటామని' గొడవ చేస్తున్నారు.

"ఇవ్వాళ మనింటికి చుట్టాలు వచ్చారుగా రేపు పెట్టుకుందువు గానిలే!" అంది అనసూయ. విమల వినలేదు. "ఇవ్వాళ వాళ్ళున్నారు కదా! వాళ్ళని అందరికీ చూపెట్టాలి. మా ఇంటికి ఎంత అందమయిన, ధనవంత మయిన బంధువులు వచ్చారో" చూడండి అంటూ తన స్నేహితులు ముందు బడాయి ప్రదర్శించుకోవాలి. అదీ ఆ పిల్ల తపన. అందుకని విమల పట్టుపట్టింది.

"సరేలే, ఆ పిల్లలు వూళ్ళోకి నడవ గలరా. నువ్వు అన్నయ్యా వెళ్ళి నీ స్నేహితుల్ని పిలుచుకు రండీ" అంది అనసూయ. చలపతి సైకిలు తీసాడు. విమల వసుధలు మంచి బట్టలు కట్టుకుని సైకిలుకి వెనకాతల ఒకరు, ముందు ఒకరు కూర్చున్నారు. తోట మెయిన్‌గేటు వద్ద నుంచుంది భ్రమర.

"ఎక్కడికి పారిపోతున్నావు?" అంది. చలపతి ఏమి మాట్లాడలేదు.

"వూళ్ళోకి వెళ్తున్నాం — మీరు కూడా వస్తారా ?" అంది విమల.

"ఎల్లా రానూ – మీరు ముగ్గురు. సరిపోయారు సైకిలుకి" అంది భ్రమర.

"నువ్వు దిగిపోవే, వసూ ! ఆంటీ ఎక్కివస్తారు" అంది విమల.

'ఊ ఊ! నేను దిగను. కావల్సివస్తే నువ్వేదిగు" అంది గొనుగుతూ వసుధ.

"వుట్టి మొండిదండి మా వసుధ !" అంది తను వక ఆరిందలాగ. వచ్చిన అవకాశం వదులుకోవటం ఆ పిల్లకి చాతకానే కాదు.

"పోనీ నువ్వు వుండిపో, చలపతి ! మేము ముగ్గురం వెళ్లి వస్తాము"

అంటె భ్రమర. తనకి ఎటో అటు తిర గాలని వుంది.

"మరి మీరు సైకిల్ త్రొక్కు తారా ?" అంది విమల.

"ఓ – మీ అన్నకన్నా స్పీడుగా తొక్కగలను"

"ఆ వూరు నీకేం తెలుసు ?" అన్నాడు చలపతి.

"దారి విమల చూపుతుంది. నీకు దారి తెలుసుకదా ?" అంది భ్రమర.

"ఓ ! నాకు దారి ఎందుకు తెలియదు ? దగ్గర దారి తెలుసు, మెయిన్‌రోడ్డు తెలుసు" అంది విమల.

"ఈ వూళ్లో సైకిలు తొక్కే ఆడ పిల్లలు లేరు. నవ్వుతారు అంతానూ !"

"నవ్విపోతే నాకేమి తగ్గిపోతుంది. జస్ట్ చిన్న సరదా! ఆ వూరు ఎల్లా వుంటుందో ఏమిటో చూడాలని !" అంది భ్రమర.

"ముందు నువ్వు ఆ బట్టలు మార్చుకో ! లుంగీ కాళ్లికి అడ్డం పడుతుంది. రెండు మైళ్ళు సైకిలు తొక్కలేవు."

"ఇంక వేరే ఏమి తెచ్చుకోలేదు. ఏం కట్టుకోనూ ?"

"మా అమ్మగారి చీర కట్టుకోండి" అంది విమల.

"చీర కట్టుకోవడం నాకు రానే రాదు" అంది భ్రమర.

"చివరకి చలపతి పాంటు తొడుక్కుని బయలుదేరింది. విమల, వసుధ తమ స్నేహితుల ఇళ్లన్నిటికీ తీసుకు వెళ్లారు. అందర్నీ సాయంకాలం "గొబ్బిళ్ల పూజకి' రమ్మని పిలిచారు.



గెలిలియో కాలంలోను, న్యూటన్ కాలంలోను దూరదర్శిని (టెలిస్కోప్) ద్వారా కొన్ని లక్షల నక్షత్రాలను మాత్రమే వీక్షించగలిగారు : ఈనాటి టెలిస్కోప్‌లు లక్షల కోట్లు కాదు – శతకోటి అర్బుదాల నక్షత్రాల ఉనికిని తెలుపుతున్నాయి. (అర్బుదమంటే పదికోట్లు)

అందరూ అడిగారు భ్రమర ఏమవుతుందని? భ్రమర అందంగా వుంది, చురుకుగా వుంది, చలాకీగా వుంది : కాని ఆ దుస్తులేమిటో? ఎక్కడా నమ్రత అనేది లేదు – అనుకున్నారు. విమలకి తెలిసీ తెలియని వయస్సు !

"మా తాతయ్యగారి మనవరాలంట" అంది. సాయంకాలం పిల్లలే కాక పెద్దవాళ్ళు కూడా వచ్చారు, సుగుణ, సుమనలని చూడటానికి. అనసూయమ్మని లక్ష ప్రశ్నలు వేసారు.

"నాలుగు రోజులుండడమ్మా మీ ఇల్లు మీ వాకిలి, వుండటానికి మొహమాటం ఎందుకు! ఎప్పుడో పంతులు గారు, భార్య బతికున్న రోజుల్లో పిల్లా జల్లా వచ్చి నాలుగు రోజులుండి అందర్నీ గడగడలాడించే వారు" అన్నారు. పెరట్లో పేడ కళ్ళాపు జల్లి, పెద్ద పెద్ద ముగ్గులు పెట్టారు. నాన వేసిన పెసరపప్పు, కొబ్బరికాయ, బెల్లం కలిపి ప్రసాదం చేసారు. పెరట్లో రెండు అరటిపండు గెలలు పండాయి. అవి ముత్తయిదువులకి పంచారు. ఆవుపేడ తెచ్చి గుండ్రాయి అంత ముద్దలు చేసారు. పీటకి పసుపు రాసి, వరిపిండితో ముగ్గులు పెట్టారు. గుమ్మడి పూలు బంతి పూలు తెచ్చి గొబ్బెమ్మలకు పసుపు కుంకుమ వరి పిండతో చుక్కలు పెట్టి పూలు గుచ్చారు. పెరడంతా అరచేయి అంత విచ్చిన బంతిపూలతో నిండిన బంతి చెట్లు వున్నాయి. ఆ బంతిపూల చెట్ల అందానికి మురిసిపోతరు శీల, మాల.

"అక్కా అక్కా! వీళ్ళింట్లో లాగ మన ఇంట్లో కూడా ఈ ఫ్లవర్స్ వేద్దామా!" అన్నారు. వాళ్ళకు పూల తోటలంటే సరదా.

"హుష్! వీళ్ళిల్లు కాదు. ఇదీ మన తాతగారిదే" అంది సుగుణ.

"అబ్బ! ఇప్పట్నించే ఈ లావా దేవీలన్నీ వాళ్ళ పసి బుర్రలోకి ఇంజక్టు చేయకండి - వాళ్ళనైనా ఫ్రష్‌గా పెరగనివ్వండి" అంది భ్రమర. శీల, మాల చిన్నబుచ్చుకున్నారు, భ్రమర మాటలకి.

"ఏం ఇప్పుడు వాళ్ళు ఫ్రష్‌గా లేరంటావా?" అంది సుగుణ. సుమన పక పక నవ్వింది.

"ఆస్తులు, వ్యవహారాలు వాళ్ళకెందుకు? ఎక్కడ ఆనందంగా, సంతోషంగా సౌఖ్యప్రదంగా వుంటే అక్కడ్నే నాలుగు రోజులు గడపగలిగేలా వుండాలి".

"అల్లా అని మనది కాని దానిది మనం అనుభవించగలమా? మనని అనుకున్న స్వతంత్రం పరాధీనతలో వుంటుందా?" అంది సుగుణ.

"తాతగారిది మనది కాదేమిటి! మనది అనుకున్నాము కాబట్టే అమ్మ మనలని ఇక్కడకు తీసుకువచ్చింది" అంది సుమన.

"అది సరే! అవి అన్ని అమ్మలాంటివాళ్ళు ఆలోచించుకోవలసిన విషయాలు. శీల, మాల చిన్నపిల్లలు. వాళ్ళకిలాంటి పెద్ద పెద్ద విషయాలు అక్కర్లేదు. వాళ్ళు పట్టించుకోనక్కరలేదు" అంది భ్రమర.

"వాళ్ళంతా మనల్ని వింతవింతగా పట్టిచూస్తున్నారు చూడక్కా" అన్నారు శీల, మాల.

"చాలారోజులకి వచ్చాము కదా! అందుకనీ అల్లా చూస్తున్నారు. పైగా మనం వాళ్ళకన్నా చాలా గొప్ప వాళ్ళం, అందుకే మనల్ని అల్లా చూస్తున్నారు" అంది భ్రమర.

"మనం గొప్పవాళ్ళమా! గొప్ప వాళ్ళంటే ఏమిటి! వాళ్ళింట్లో ఇందాక అందరు మన బట్టలు అవీ చూసారు. అవి చాలా మంచివన్నమాట! మనకేమి

ఆర్నమెంట్స్ లేవే!"

"గొప్పవాళ్ళంటే రిచ్ పీపుల్ అన్నమాట! వెల్ డూయింగ్ అన్నమాట!" అంది భ్రమర.

"మరి మనకేమి లేదనీ, అంతా తాతయ్యగారి దయవల్లనే బాగా జరుగుతున్నాదని అంటుందేం అమ్మ!" అంది శీల సందేహంగా.

"సరదాకి అంటుందిలే. భ్రమరా, నీ సంభాషణ దారి ఎటు వెళ్ళిందో చూడు?" అంది సుమన.

"అంతే! వాళ్ళకి బుర్రలో ఏదో పురుగు ప్రవేశించింది. అల్లా గొనుగుతూనే వుంటారు. వాళ్ళూ అంతే! వెర్రిముఖాల్లా నోరు తెరుచుకుని చూడకపోతే కాస్త పలకరించి మంచీ చెడ్డా మాట్లాడకూడదూ?" అంది భ్రమర. వాళ్ళ వింత వింత చూపులు భ్రమరని కలవరపెట్టాయి.

"ఇది కలకత్తా కాదు. ఇక్కడ వీళ్ళంతా అదోకరకం మనుష్యులు. వాళ్ళమాటకి కాస్త తేడాగా కన్పించితే ఐసోలేట్ చేసేస్తారు. కాస్తా చలపతీ వాళ్ళు నయం. మరీ దేభ్యరకం కాదు. కాస్త మాట మన్ననా వుంది" అంది సుగుణ.

"వాళ్ళ నాన్న మన తాతయ్యకు గుమస్తాగా వున్నాడు కాబట్టి వీళ్ళయినా మనతో కబుర్లు చెబుతున్నారు. లేకపోతే వీళ్ళూ ఆ గుడ్లగూబలతో జత అయ్యేవారే! విమల, వసుధ చిన్న పిల్లలు కూడా!"

"చలపతి మంచివాడేలే సుగుణ.




తుఫాను గాలులు సుడులై భూమధ్యరేఖకు ఉత్తరాన ఎడమనుండి కుడి వైపుగాను, దక్షిణాన కుడి నుంచి ఎడమవైపుగాను చక్రనేమి క్రమంగా తిరుగుతాయి.

"మన తాతయ్య చలువ వల్ల చదువుకుంటున్నాడు. మంచివాడు కాకపోతే మన తాతయ్య కానీ విడవడు తెలుసా!"

అయిదుగురు అక్కచెల్లెళ్లూ పెరట్లో ఒక వార కూర్చుని వాళ్ళలో వాళ్ళే గుబగుబ మాట్లాడుకుంటుంటే అమ్మలక్కలంతా నోళ్ళు తెరుచుకుని వాళ్ళ వెంపే చూస్తూ కూర్చున్నారు. బాగా చీకటి పడిపోయినాక, చంద్రోదయం అయిన తర్వాత అందరూ ఏవళ్ళ ఇంటికి వాళ్ళు వెళ్ళినారు. భ్రమర వసుధని పిలిచింది.

"ఇందాక ఏదో పాడారు, మీ పిల్లలంతా కలిసి ఏమిటి ఆ పాట? మళ్లీ పాడు" అంది భ్రమర.

"ఒక్కదాన్నే - భయం" అంది వసుధ.

"విమలా నువ్వూ కలసి పాడండి" అంది భ్రమర.

విమల శీల మాలని కూడా కలి పింది. అందరూ చేతులతో చప్పట్లు చరుస్తూ గొబ్బెమ్మలుంచిన పీట చుట్టూ గుండ్రంగా ప్రదక్షణం తిరుగుతూ పాడారు.

"గొబ్బియళ్ళో గొబ్బియళ్ళో! దుక్కుదుక్కుదున్నారుట. ఏమి దుక్కు దున్నారంట - రాజువాళ్ళ తోటలోన జామి దుక్కు దున్నారంట! ఔనట అక్కల్లారా చంద్రగిరీ భామల్లార! వామనగిరి గొబ్బియళ్ళో!" అంటూ పాడారు. శీల పాల గొబ్బెమ్మల పాట వ్రాసుకున్నారు.

"బామంతి పూవంటి చెల్లెల్నియ్యవే
బంతి పూవంటి బావనియ్యవే
మొగలి పువ్వంటి మొగిణ్ణియ్యవే"

అంటూ పాడిన పాటలో

"మొగుడంటే ఏమిటి?" అంది భ్రమర.

"మీ అమ్మగారిని అడుగు" అంది విమల.

"అమ్మకీ తెలియదు. ఏమన్నా అడిగితే అన్ననే అడగమంటుంది"

"అయితే మీ అన్నకే అన్నీ తెలుసన్నమాట!"

"బాగా చదువుకుంటున్నాడుకదా!"

"చదువుకోవటం ఏమన్నా గొప్ప అనుకుంటున్నారా మీరు? అందరూ చదువుకుంటున్నారు."

"మాకు చదువుకోబుద్ధి పుట్టదు. మా అన్నయ్య అయితే ఎప్పుడూ చదువు కుంటూనే వుంటాడు. అంచేత మా అన్నయ్య మాకు అన్నీ చెబుతూ వుంటాడు" అంది విమల. అనసూయ భోజనాలకు రమ్మని కేకవేసింది. కబుర్లు చాలించి అందరూ లోపలికి వెళ్ళారు. మర్నాడు ఉదయాన్నే అందరూ సర దాగా కాలినడకన ఊరిలోకి బయలు దేరారు. ఎక్కడ చూసినా పిల్లలు గర గరమంటూ కొత్త బట్టలు కట్టుకుని, తలనిండా చామంతి పూలు పెట్టుకుని కంటి నిండా కాటుక, నుదుట గుండ్రటి బొట్టుతో కన్పించారు. నాలుగు రోడ్లు కలిసే చోట భోగిమంటలు వేసిన దూలాల నిప్పులు ఇంకా చల్లారనే లేదు. ప్రతి ఇంటి ముంగిటా సంక్రాంతి రథాల ముగ్గులు పెట్టారు.

"మన పట్నంలోకంటె పల్లె టూళ్ళల్లో ఎక్కువ వేడుకగా జరుపు కుంటూన్నారు పండగలు" అంది సుమన.

"పల్లెజనానికి ఫెస్టివల్స్ అంటే ప్రీతి ఎక్కువ. ఎంతో శారీరక శ్రమ పడతారు. అందుకని పండగల కోసం ఎదురు చూస్తూవుంటారు" అంది సుగుణ

"వాళ్ళకి విశ్రాంతి ఇచ్చేది, వేడుకా వినోదాన్నిచ్చేది ఈ పండుగ రోజులే! అందుకనే వున్నా లేకపోయినా అప్పో సప్పో చేసి పండుగ రోజుల్ని ఉత్సా హంగా గడపటానికి ప్రయత్నించు తారు" అంది భ్రమర. కబుర్లు చెప్పు కుంటూ ఊరంతా తిరిగి ఒంటిగంట దాటినాక ఇల్లు చేరారు అంతా!

* * *

"శ్రీరంగ నాన్నగారు ఏం చేస్తారు?" అడిగారు పంతులుగారు ఒకరోజు చలపతిని.

"అతనికి నాన్నగారు లేరండి - పోయారు."

"స్థితిమంతుల్లా వున్నారు చూడ పోతేను. ఇల్లూ వాకిలీ వున్నట్లువుంది."

"ఇద్దరే అన్నతమ్ములండి - మేన మామల దగ్గర వుండి చదువుకుంటు న్నారు. కొంచెం పొలం కూడా ఉన్నాది లెండి."

"అన్నయ్య ఏం చేస్తున్నాడు? శ్రీరంగ కన్న తెల్లగా వుంటాడుట కదా"

"బి. ఎ. ప్యాసు అయినాడండి. ఉద్యోగంకోసం చూస్తున్నాడల్లేవుంది." చలపతికి కొంచెం ఆశ్చర్యంగా వుంది. ఇన్నాళ్ళనుండీ తమతోటి కుర్రాళ్ళు అంతా ఆయనకు సన్నిహితంగానే మెలుగుతూ వచ్చినా, ఎవరి కుటుంబ వివరాలూ అయన అడిగేవారు కాదు. శ్రీరంగ, తను మైలవరం వెళ్ళిన పది పదిహేను రోజుల్లోనే, పంతులుగారిం టికి రాకపోకలు ఎక్కువ చేశాడని గ్రహించాడు. తరచు రామజోగి పంతులుగారితో చదరంగం ఆడటం కూడా చూసాడు. ముసలాయనకి ఏదో కాలక్షేపం కాబోలు అను కున్నాడు. కాని ఇదేదో కొత్త రకం బంధానికి నాంది పలుకుతుందని అనుకోలేదు చలపతి.

"ఒరేయి చూడరా ముసలాయన ఎత్తులు?" అన్నాడు ఒకరోజు శ్రీరంగ.



"ఏమిటిరా?" అన్నాడు చలపతి. శ్రీరంగకి తెలివయిన విద్యార్థి అని క్లాసులో పేరుంది. అతని అన్నయ్య కూడా ఫస్టుక్లాసుతోనే బి. ఎ. ప్యాసు అయినాడు.

"ఇంట్లో చేరారు కదరా ఆడ మంద - వాళ్ళ గురించి ఒకటే తాప త్రయంగా వుంది పంతులుగారికి"

"బాగుంది! ఆయన మునిమనుమ రాళ్ళు. అసలుకంటే వడ్డీ ఎక్కువ అని వాళ్ళ గురించి ఆయనకు తాప త్రయం వుండదూ? - అంతా స్వజనం - ఎన్నిరోజులు వంటరిగా వుండేవారు!

ఇన్నాళ్ళకి ఆ మేడకి నిండిన జనం తిరుగుతున్నారు."

"ఏం స్వజనం - అంతా వెత్తా వెహారం. ఓరేయి ఈయన కూతురు అమెరికాలో సెటిల్ అయ్యిందిట - భ్రమర తండ్రి బెంగాలీ బాబుట - ఈ పిల్లలని మన కులంలో కలి పెయ్యాలని చూస్తున్నారు."

"అంటే? ఎల్లా కలుపుదామంటు న్నాడని నీ ఊహ?"

"అమ్మాయిలకి మామూలుగా పుట్టి పెరిగితేనే పెళ్ళిళ్ళు అవటం బ్రహ్మ ప్రళయం – అందులో తల్లి అమెరికన్, తండ్రి బెంగాలీ! ఇలాంటి అష్ట గోత్రులకి పెళ్ళిళ్ళు ఎట్లా అవు తాయి చెప్పు?"

"అమెరికన్ తల్లికీ, బెంగాలీ తం డ్రికీ ఆడపిల్లలుగా పుట్టితే ఇన్ని సమస్య లుంటాయని వీళ్ళకి తెలియ దల్లే వుంది. తెలిస్తే మగపిల్లలుగానే పుట్టుదురు. అప్పుడు మనవాళ్ళంతా మా అమ్మాయిని పెళ్ళి చేసుకోండి అంటే మా అమ్మాయిని చేసుకోమని అహమహమికతో వాళ్ళింటి చుట్టూ తిరుగుదురు."

"ఇన్ని రోజులుగా ఇరుగూ పొరు గుగా వుంటున్నామా – మా ఇంటి వెంపు కన్నెత్తి చూసేవారు కాదు. ఇప్పుడు అస్తమానూ నౌకర్లతో ఏదో వకటి పంపుతున్నారు నజరానాలు"

"మా నాన్న మైలవరం వెళ్ళినాక అక్కడ్నించి పళ్ళూ, ఫలాలు సమృ ద్ధిగా పంపుతున్నారు. మునుపున్న గుమాస్తాదారు అన్నీ అమ్ముకుని సొమ్ము చేసుకునేవాడుట. వూళ్ళో వాళ్ళు చెప్పారు. మా నాన్న మా కుటుంబానికి సరిపోయినవన్ని వుంచు కుని, కొన్ని వూళ్ళో తెలుసున్న వాళ్ళకి ఇచ్చి, మిగిలినవన్నీ పంతులు గారికి పంపేస్తున్నారు. అంచేత వాళ్ళు ఇరుగూ పొరుగుకీ కూడా పంపగలుగు తున్నారు."

"అది సరేలే - మొన్న మా మామయ్యని పిలిచి అడిగారుట! మా అన్నయ్యకి సుమన నయినా, సుగుణ నయినా చేసుకోరాదా అని"

"ఏమన్నారు మా మామయ్య?"

"ఏమనలేకపోయాడుట – కట్నం ఎంతంటే అంత ఇస్తాము అన్నారుట– పిల్లలిద్దరూ గ్రాడ్యుయేట్లు! ఉద్యోగం కూడా మేనమామలు ఎక్కడ్నో అక్కడ చూపెడటానికి రెడీయేట!"

"మీ అన్నయ్యకిష్టమా మరి?"

"మామయ్య చెబితే అన్నయ్య మాట్లాడలేదు. నిజానికి మామయ్య సుముఖంగానే వున్నారు. పెద్దవాళ్ళతో పని. అంతటి ఆయన నోరు విడిచి అడిగారు కాదనటం బాగుండదు – అన్నాడు. మా అన్నయ్య, మరీ వర్ణ సంకరం, డబ్బు వుంది కదా అని కులం వదులుకోమంటారా, అంటు న్నాడు".... "మా అమ్మగారో మరి"

"ఆమెకేమీ తెలియదు. పసుపు ముఖం నిండా రాసుకుని నుదుటిన గుండ్రటి కుంకుమ దిద్దుకుంటే ఆమె సాంప్రదాయ కుటుంబంలోని అమ్మాయే అనుకుంటుంది" చలపతి మాట్లాడలేదు.

(ఇంకా వుంది)

## సమీక్షలు

### శ్రీకృష్ణ ప్రసన్నా 'మకుటంలేని మహారాజు'

రాఘవయ్య (రావుగోపాలరావు) శివుడు (గుమ్మడి వెంకటేశ్వరరావు) చిన్ననాటి స్నేహితులు. శివుడు అతి భాగ్యవంతుడవటంతో, అతని భార్యా పిల్లలు (ఒక అబ్బాయి, యిద్దరమ్మాయిలు) విలువలు లేని విలాసమయ జీవితానికి అలవాటు పడతారు. కారాక్సిడెంట్ కారణంగా బాల్యమిత్రులు మళ్ళీ కలుసుకుంటారు; రూపాయిల చుట్టూ తిరిగే తమ జీవితాలలోకి మానవత్వమనే దీపకాంతిని తెస్తుందనే ఆశతో రాఘవయ్య కూతురు సుమతినీ (పూర్ణిమ), తమ యింటి కోడలుగా తెచ్చుకుంటాడు శివుడు. సుపుత్రుడు మొదట్లో నసిగినా స్వార్జితమైన ఈ ఆస్తిని పితృదేవుడు ఏ అనాథాశ్రమానికో రాసేస్తాడను భయంతో, పెళ్ళికి వొడపడుతాడు.... యమపాశం చేత ధరించి సంఘవిద్రోహులకు పక్కలో బల్లెమైన పార్థసారధి (కృష్ణ), రాఘవయ్య కొడుకు. తండ్రీ కొడుకుల బంధం. ఈ పార్థసారధి తప్పుడు పని వల్ల, ఏనాడో తెగిపోయింది. రౌడీలకు రౌడీ మకుటంలేని మహారాజు. ఆర్త త్రాణపరాయణుడు, అర్భకులని ఆదుకొనేవాడు, సత్యసంధుడు, నిష్కళంక చరితుడు, దీనజనరక్షకుడు అయిన ఈ హీరో, వేశ్యాకులంలో జన్మించిన సరోజని (శ్రీదేవి) ఆపదలో వుండగా కాపాడి, ఆమె హృదయచోరుడవుతాడు; అంతేగాదు, తన బావమరిది పన్నిన వుచ్చులోనుంచి ఆమెని బయటికి తెచ్చి మెడలో మంగళసూత్రం కడతాడు. అయితే, యింకా చాలా చాలా కష్టాలు పడినమీదటగాని వారి సంసారం చక్కబడదు.... అన్నీ ఆయా మోతాదుల్లో అందించిన ఈ ఫార్ములా చిత్రానికి దర్శకులు బాపయ్య. నిర్మాత: బివియస్‌యన్ ప్రసాద్.

### కోణార్క్ వారి 'సంకీర్తన'

ఒక జాలర్లబ్బాయి, ఒక బ్రాహ్మలమ్మాయిని ప్రేమిస్తాడు. ప్రేమ అజేయము, అమరము, దివ్యసుగంధము, నిత్యశోభితము- యిలాటివన్నీ బలపరిచేందుకు అతను సహజకవి, ఆమె నాట్యకళాపిపాసి (కళావంతులమ్మాయి అనే సినిమా ట్విస్ట్ చివర్ని వెల్లడవుతుంది). క్రమశిక్షణ పొందిన ఈ అమ్మాయి, తన కాలి గజ్జెలకు అంకిత

మయిందంటే అర్థం వుందిగాని చదువు సంధ్య లున్నట్లు దాఖలాలేని జాలరి యువకుడు, నలుగురు చిన్నపిల్లల్ని వెంటేసుకుతిరిగే అపరిపక్వ మనస్కుడు, దురాదేవిని ఆరాధించే కీర్తనలో (రమ్యకృష్ణ), కవితాకన్యను చూడగల గడం కొంచెం విడ్డూరమైన విషయం. వాస్తవికతకు కడుదూరం. ఈ కాశీలో (నాగార్జున) కవిత పుట్టేందుకు ప్రేరణ గాని, ఆ అమ్మాయితో యితని పట్ల వలపు మొలకెత్తే సంఘటనగాని కని పించదు. ఈ ఇరువురు కళాకారులని ఒక పట్నంబాబు (శరత్‌బాబు) వచ్చి ఆశీర్వ దిస్తాడు - అతను విదేశాలలో పర్య టించి వచ్చిన గొప్ప చిత్రకారుడు. కీర్తనపై అతనికీ మనసు వుంటుంది గాని కాశీకీర్తనల పవిత్ర ప్రేమ తెలియ గానే తను పక్కకి తప్పుకుంటాడు. సినీ విలనులు, ఫార్ములా సన్నివేశాలు, వందరూపాయిల నోటుయిస్తే వస్తామనే వేశ్యలు, దేవీపూజకీ అమ్మవారి పూన కానికీ ముడి పెట్టడం, ఒక సవతి తల్లి ఆగడాన్ని తెలుసుకోలేని అగ్రహారం ప్రజ, పద్దెనిమిదేళ్ల తర్వాత ఒప్పు కొన్న తప్పుని సరిదిద్దుకోలేని నాట్యా చార్యుడు (గిరీష్ కర్నాడ్) - ఈ విధంగా సాగుతుంది. చివరికి ప్రేమ జయిస్తుంది - మూఢాచారాల మీద ముక్తసరి ఉపన్యాసాలతో - ఒకసారి నాగార్జున, ఒకసారి శరత్‌బాబు.... ఏ చిత్రంలోనైనా సంగీత నాట్యాలు భోజనంలోని పాయసం వంటివి. మిగతా ఆధరువులతో భోజనం వున్న మీదట పరమాన్నానికి రుచి..... ఇళయరాజా సంగీతమెంతో శ్రవణానందకరంగా ఉంది. కెమరా వర్క్‌తో సంతోష పెట్టారు తప్ప కధలో బిగువు లేదు, నడకలో నాజూకు లేదు. దర్శకులు గీతాకృష్ణ ప్రయత్నం ప్రశంసనీయం. అయితే, లలిత కళలకు ప్రతీకగా పాత్రలు దిద్దినంత మాత్రాన చాలదు ; సామాజిక వాస్తవికత అనే ఊపిరి వాటికి పోయాలి .... రమ్యకృష్ణ చాలా బాగా చేసింది; గిరీష్ కర్నాడ్, సోమయాజులు వంటి నిష్ణాతుల గురించి చెప్పవలసిన పనిలేదు. నాగార్జున ఉచ్చారణ, భావ ప్రకటన రెండూ డిజపాయింటింగ్ .. పాటల కోసమే ఈ చిత్రాన్ని చూస్తారు, నిర్మాత: గంగయ్య.

## గీతా ఆర్ట్స్
## 'ఆరాధన'

ఆ ఆలు కూడా దిద్దుకోని నిశాని దారు పులిరాజు (చిరంజీవి) అప్పటికి పద్దెనిమిదిసార్లు జైలుకెళ్లి వచ్చిన రౌడీ. జెనిఫర్ (సుహాసిని) అనే పంతులమ్మ గంగవరం వస్తుంది. పులిరాజు తన తల్లిపై చేయి చేసుకొన్న సందర్భంగా, జెనిఫర్ యితని లెంప వాయిస్తుంది. మృగప్రాయుడైన ఈ మనిషిలోకి మిను కు మినుకుమనే కాంతి చొరపడుతుంది. టీచరు అతని పాలిట ఆరాధ్య దేవత. ఆ చెత్త గ్రామంలో తప్పబుట్టిన ఈ పులి రాజు, జెనిఫర్ కారణంగా మార్పు చెందుతాడు. అయితే, వెనకటి మల్లే యితని గురించి ఎవరూ భయపడరు -

నెమ్మదస్తుడై పోవడం వల్ల! మామ కూతురు గంగ (రాధిక) జమక్ జమక్ టమక్ టమక్ భాషతో యితనినే కట్టుకునేందుకు ప్రయత్నించి, ఎంతో నేర్పుగా నాటకమాడి కూడా, విఫలు రాలవుతుంది. తమ కుటుంబాన్ని అన్ని విధాలా ఆదుకోనున్న లారెన్స్‌ని (రాజశేఖర్) కాదని, ఈ పులిరాజు ఘాటు ప్రేమకు బందీ అవుతుంది జెనిఫర్-చర్చి గంటలు శుభం పలుకుతాయి. కథలో కించిత్ వాస్తవికత కూడా లేదు. అయినప్పటికీ ప్రేక్షకాదరణ పొందగల సందర్భాలు, సన్నివేశాలు అనేకం వున్నాయి. సముద్రము, కొండలు, కష్టపడి తెచ్చిన శంఖం, చర్చిగంటలు, శిథిల గృహాలు, ప్రభువు కిష్టమైన గొర్రెపిల్ల, పరిణయానికీ ప్రేమకూ మధ్య వూగిసలాడే వనితా హృదయం, పులిరాజులోని పరిణామ క్రమం - యిలాంటివన్నీ సినీ నాటకీయతకు అనుగుణంగా వాడారు. దర్శకులు భారతీరాజా. ప్రారంభంలో చెప్పినట్లు ఈ చిత్రంలోని ప్రధాన పాత్ర కెమెరాది. చిరంజీవి చూపిన నటనా కౌశలం మెచ్చుకోదగ్గది. హృదయ సాగర మథనం సుహాసిని చూపితే, అసహాయ బెస్త వనిత గుండె నిబ్బరాన్ని రాధిక ప్రదర్శించింది. అంతా ఫార్ములాయే అయినప్పటికీ అందాలు కురిపించిన ఈ చిత్రానికి నిర్మాత : అల్లు అరవింద్.

## ప్రవాహాంధ్ర చిత్ర
## 'పడమటి సంధ్యా రాగం'

బాబాయి, పిన్ని (మీర్ అబ్దుల్లా సుధ) అమెరికాలో ఉన్నారు. నాన్న, అమ్మతో (గుమ్మలూరి శాస్త్రి, ఆశా జ్యోతి) తను కూడా వెళ్తుంది సంధ్య (విజయశాంతి). సంధ్య తండ్రికి అక్కడి పద్ధతులు నచ్చవుగాని తప్పనిసరిగా సర్దుకు పోతూ వుంటాడు. ఇంగ్లీషు ముక్కరాని ఈ సంధ్యని, ఒక నీగ్రో యువకుడు, ఒక అమెరికన్ యువకుడూ ప్రేమిస్తూ వుంటారు; ఇద్దరూ ఒక గణపతి వద్ద ఈమెకు తమ మనో భావం తెలిపే నిమిత్తం తెలుగు నేర్చుకుంటారు. తండ్రిది గాత్రం (సదాశివ బ్రహ్మేంద్ర యోగి 'రామరసం'), సంధ్యది వయొలిన్, నీగ్రోవి డ్రమ్స్; శ్వేత వర్ణునిది పియానో. 'లైఫ్ ఈజ్ షాబీ వితవుట్ యు బేబీ' అని నల్లబ్బాయి పాడితే, 'ముద్దుగారె యశోద ముంగిట ముత్యము వీడు' (అన్నమాచార్య) అని తమ దాంపత్య ఫలం గురించి కలగంటూ తెల్లబ్బాయి వైపు మొగ్గుతుంది సంధ్య. తల్లి మెత్తబడ్డా తండ్రి కొరకరాని కొయ్య అవుతాడు. ఆ యువతీ యువకులు ఇండియన్ మ్యూజిక్‌తో క్రైస్తవ చర్చిలోను, వెస్టర్న్ మ్యూజిక్‌తో పిట్స్ బర్గ్ దేవాలయంలోను పెళ్లి చేసుకుంటారు. పెళ్లి జరిగిన పద్దెనిమిదీ ఇరవై ఏళ్లకు తండ్రిగారు మరణించిన సందర్భంగా భారత దేశానికి భర్తతో వచ్చిన సంధ్య, తన కూతురికి ఈ కథ చెప్పవలసి అవసరం ఏర్పడుతుంది. సంధ్య భర్త, మామగారికి హైందవ పద్ధతిలో దహన సంస్కారం స్వయంగా చేస్తాడు. నాలుగైదేళ్ల వయసప్పుడు తాతగారితో ఇండియా వచ్చేసిన సంధ్య కూతురు అనిత, నిర్హేతుకంగా తలిదండ్రులపై క్రోధం పెంచుకుంటుంది. – తాతగారి బోధలూ పెంపకమూ కారణం కావచ్చు; చివరిక్షణం దాకా తన తలిదండ్రులు ఎంతటి ఉన్నతులో ఎటువంటి సంస్కారవంతులో తెలుసుకోలేక పోతుంది. చివరి సీనులో విజయశాంతి చేత చెప్పించిన సమీక్ష చాలా చక్కగా ఉంది. గుమ్మలూరిశాస్త్రి గొప్పగా వొప్పించాడు. తమ్మునిగా మీర్ అబ్దుల్లా వొదిక కనబరిచాడు. ఆవకాయనీ అయిస్‌క్రీమ్‌నీ కలిపే టామ్, తెలుగు ప్రేక్షకులని మెప్పించడం ఖాయం. పాత్ర చిత్రణలోను, సన్నివేశాల నడకలోను, కథా వైచిత్రిలోను, సందర్భోచిత రసపోషణలోను దర్శకులు జంధ్యాల ప్రత్యేక శైలి కనిపిస్తుంది. ప్రాక్ పశ్చిమ సంస్కృతీ వారధిపై హృదయతంత్రీ రవళులు పలికించిన చిత్రమిది. సమర్పణ: జి. సుబ్బారావు.

కోపర్నికస్, గెలిలియో, న్యూటన్‌ల కంటె మానవుని భావసరళిలో విప్లవాత్మక పరిణామం తెచ్చిన మహనీయుడు అల్బర్ట్ అయిన్‌స్టీన్.

— హాల్డేన్

## కెసియన్ ఫిలింస్
## 'తేనెమనసులు'

మత్స్య పరిశ్రమలోని లాంచీ ఓనరు కృష్ణబాబు (కృష్ణ), కాలం ఖర్మం కలిసిరాగా, మామగారి (జగ్గయ్య) ఉదారబుద్ధివల్ల ఓడకి ఓనరవుతాడు; ధనవంతులమ్మాయి రుక్మిణికి (జయప్రద) వల్లభుడవుతాడు. అయితే, ఈ 'స్పాయిల్ట్ గరల్'కి, అహంభావమే తప్ప బుద్ధి జ్ఞానాలు వుండవు. మామయ్య. (నూతన్ ప్రసాద్), మమ్మీ (సవతితల్లి) తన కాపరంలో చిచ్చుపెట్టడమేగాకుండా తనకు యబార్షన్ అయినప్పుడు యుటిరస్ (గర్భసంచి) తీయించేసిన పరమ కిరాతకులని తెలిసినప్పటికీ, కట్టుకున్న భర్తలోని ఔదార్యం గ్రహింపనేరని మూర్ఖురాలు. కృష్ణబాబుకి నమ్మకమైన అకవుంటెంట్ సత్యంగారు (సత్యనారాయణ). అయన కుమార్తె రాధకు (సుహాసిని), కృష్ణబాబు పట్ల ఆరాధన, గౌరవమూను, ప్రణయోత్సాహంలో తామిద్దరూ రాధాకృష్ణులైనట్లుగా చిత్రపటం లిఖిస్తుందిగాని, ఈ కృష్ణబాబు అతని అంతస్తుకి తగిన రీతిలో రుక్మిణీ నాధుడవనున్నాడని తెలియగానే ఆ రంగులకలనీ, రంగుల చిత్రాన్నీ చేజేతులా తుడిచేస్తుంది. అయినప్పటికీ వారిద్దరి మధ్యా పరస్పర ప్రేమాభిమానాలు లేకపోలేదు. రుక్మిణిని ఎలాగైనా తన వలలో వేసుకోవాలని చూస్తున్న మామయ్య, రాధకి ఒక తాగుబోతుతో పెళ్ళి జరిపించడం, తండ్రినీ భర్తనీ కోల్పోయిన ఆ దీను రాలైన గర్భవతిని కృష్ణబాబు ఆదుకోవలసి రావడం, విదేశపర్యటన చేసి వచ్చిన రుక్మిణికి కృష్ణబాబు రాధల అక్రమ సంతానమే ఆ పసిపిల్ల అనే నమ్మకం ఏర్పడటం – యిటువంటి మెలికలతో కథసాగి, రాధ ఆత్మార్పణతో రుక్మిణి కళ్లు తెరువులకి వస్తాయి; ఆ అనాధ శిశువుని రుక్మిణి చేతికెత్తుకుంటుంది. కృతక సన్నివేశాలే తప్ప స్వభావ న్యాయం గాని, సందర్భోచిత మార్గంగాని కనిపించదు.... గర్భసంచీ తీయించేసు కొన్న రుక్మిణి నుంచి కృష్ణబాబుకి విడాకులు అతిసులువుగా లభిస్తాయి. తన ఆత్మాభిమానాన్ని, ఆత్మ గౌరవాన్ని నిలువునా పాతేసిన రుక్మిణిని, కృష్ణబాబు ఎలా మన్నించగలడు, ఎలా ప్రేమించగలడు? రుక్మిణి మొదట్నుంచీ నిష్కృతిలేని పాత్రగా రూపొందింది. రాధాకృష్ణులు, దైహిక లాలస లేకుండా, అనాథ శిశు సంరక్షణలో, దీనులని ఆదుకోవడమనే సేవా భాగ్యంలో తమ సంపద సార్థక్యత నొందడం ద్వారా, ప్రేమసందేశం పంచి వుంటే యింకా రక్తి కట్టేది.... ఆత్మక్లేశాన్ని కృష్ణ, అహంప్రవృత్తిని జయప్రద, ఆత్మార్పణని సుహాసిని – ముగ్గురూ రస భరితంగా పోషించారు. జగ్గయ్య, సత్యనారాయణ, నూతన్ ప్రసాద్ – యివి వారికి చిరపరిచిత పాత్రలు. దర్శకత్వం: రాజేంద్ర సింగ్. నిర్మాత: కెసియన్ చంద్రశేఖర్.

# డైరీ

## 1987 ఏప్రిల్ 6

ఆరుగంటలకి మ్యూజిక్ అకాడమీలో యార్లగడ్డ వెంకన్నచౌదరి మెమోరియల్ నేషనల్ అవార్డ్ ఫంక్షన్. గత సంవత్సరం యిదేరోజున పారిశ్రామికవేత్త, దానకర్ణుడు, వితరణ గుణశీలి, విశిష్టమానవతామూర్తి అయిన వెంకన్నచౌదరి దివంగతులయారు. తండ్రిగారి గౌరవస్మృతిగా కుమారుడు శంభు ప్రసాద్ ఈ అవార్డ్‌ని స్థాపించారు; 1986 డిసెంబరు 26 నాటి పత్రికా సమావేశంలో ఈ లక్ష రూపాయిల నగదు అవార్డ్, సైన్స్ సమాచార శాఖ పద్మవిభూషణ్ మీనన్‌కు, ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి యన్‌టి రామారావుకు చెరిసగంగా యిస్తున్నట్టు ప్రకటించారు. కారణాంతరాల వల్ల మీనన్ రాలేకపోయారు; ఆంధ్ర ముఖ్యమంత్రిగా రాష్ట్రపతికి ఉదయం తిరుపతిలో స్వాగతం చెప్పిన యన్‌టిఆర్. మధ్యాహ్నానికి మద్రాసు వచ్చారు. ……. యార్లగడ్డ రాజ్యలక్ష్మీ వెంకన్నచౌదరీ కళాపీఠం వారు ఈ మెమోరియల్ నేషనల్ అవార్డ్‌ని ఆంధ్ర రాష్ట్ర ముఖ్యమంత్రి డా॥ నందమూరి తారక రామారావుకి అందజేశారు. సభా కార్యక్రమం నిర్వహించమని మురళీమోహన్, షావుకార్ జానకిని కోరిన మీదట, ఒకనాటి 'పలకరాదటే చిలకా' తన గోల్డెన్ వాయిస్‌తో, ముఖ్యులని వేదిక మీదకు ఆహ్వానించారు; శంభు ప్రసాద్ స్వాగతం తెలిపారు .... "భవిష్యత్ భారతంలో యన్‌టిఆర్ ఎంతో ప్రముఖ పాత్ర వహించనున్నారు; జాతీయ స్థాయిలో ఆయన చేయవలసినది ఎంతో ఉంది. వయసులో ఆయన కంటె చిన్నవాడినైనా, ఆయనకు గల స్టామినా, విటాలిటీ నాకు లేవు. భారత రాజకీయాలలో యన్‌టిఆర్‌ది ఒక అపూర్వ స్థానం. గత ఇరవైఏళ్లలో ఢిల్లీ దర్బారు ఎన్నో రాష్ట్ర ప్రభుత్వాలని పల్టీ కొట్టించింది. ప్రజాభిప్రాయం కంటె తమ యిష్టానిష్టాలే ప్రధానం ఢిల్లీ పెద్దలకు. ఆంధ్రుల ఆత్మ గౌరవాన్ని యావత్ ప్రపంచానికి చాటిన ఘనత యన్‌టి రామారావుది వికేంద్రీకరణ, మాటలలో గాక చేతలలో చూపించాయి పశ్చిమ బెంగాల్, కర్ణాటక, ఆంధ్ర రాష్ట్రాలు" అన్నారు సభాధ్యక్షత వహించిన కర్ణాటక ముఖ్యమంత్రి రామకృష్ణ హెగ్డె. తనకూ, యన్‌టి ఆర్‌కు కాలేజీ దినాల నుంచి, నలభై ఏళ్లగా పెన వేసుకొన్న బాంధవ్యం గురించి ముచ్చటించారు జగ్గయ్య: యన్‌టిఆర్‌లోని మనస్తత్వపు లోతులు, ప్రత్యేకత

వివరించారు ఆంధ్రా యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ రామకృష్ణారావు. తమిళ నాడు పరిశ్రమల మంత్రి రాజారామ్ తమ రాష్ట్రంలోని నీటి ఎద్దడి గురించి, కర్ణాటక ప్రభుత్వపు ఛీఫ్‌విప్ పెరుమాళ్ దక్షిణ రాష్ట్రాల పరస్పర సాన్నిహిత్యం గురించి ప్రస్తావించారు. ఈ ఏభైవేలకు తనొక ఏభైవేలు చేర్చి బీదపిల్లల పాఠశాల నిర్మాణానికి విరాళంగా యిస్తున్నాననీ, కర్ణాటకాంధ్ర రాష్ట్రాల మైత్రి చిరస్మరణీయమైనదనీ, తాను మొదట భారతీయుడననీ, తర్వాతనే తెలుగువాడిననీ, రాష్ట్రాలు బలం పుంజుకుంటేనే, కేంద్రం పటిష్టమవుతుందనీ అన్నారు ఆంధ్ర ముఖ్యమంత్రి యన్‌టి రామారావు. సభానంతరం ధనలక్ష్మి కూచిపూడి డాన్స్.

## 11

"విద్యుదుత్పత్తి పెరిగితేగాని మన పారిశ్రామిక రంగం అభివృద్ధి చెందదు. విజయవాడలోని థర్మల్ స్టేషన్, ఎటువంటి దిగుమతులూ అవసరం లేకుండా, దేశీయ యంత్ర కౌశలంతో నిర్మితమయింది. ఆ థర్మల్ స్టేషన్ కెపాసిటీలో 95 శాతం వినియోగమవుతోంది. విద్యుదుత్పాదన యంత్రాలకు దిగుమతులపై ఆధారపడటం కుదరదు – మన యింజనీరింగ్ పాటవంతో వాటిని రూపొందించి, ఉత్పాదన పెంచడం మన కర్తవ్యం" — అన్నారు కేంద్ర పరిశ్రమల మంత్రి వెంగళ్రావు, హొటల్ సవేరాలో ఆయన గౌరవార్థం యిచ్చిన విందు సందర్భంగా. తమిళనాడు పరిశ్రమల మంత్రి రాజారామ్, పరిశ్రమలలోని 'ఏ', 'బి' విభాగాలకు సంబంధించిన రాయితీ గురించి ప్రస్తావించారు. డయొనొరా, నిప్పో ల ఓబులరెడ్డి ముఖ్య అతిధిని పుష్పమాలాలంకృతులు గావించారు. హాస్పిటల్స్‌ని పరిశ్రమగా గుర్తించడం ప్రగతి సూచకమన్నారు యపొల్లో పి సి రెడ్డి. హాజీషెరీఫ్, అరుణాచలం, డి సి కొఠారి, చిత్రా నారాయణస్వామి (నలుగురూ నాలుగు స్థంభాలు పారిశ్రామిక రంగంలో) షుగర్, సిమెంట్, పేపరు పరిశ్రమలలోని సాధక బాధకాలు తెలిపారు. వెంకట్రామన్ కామరాజ్‌ల అడుగు జాడలలో, యమ్‌జిఆర్ రాజీవ్‌ల పరస్పరావగాహనతో, తమిళనాడులోని ప్రజాజీవితమూ, పారిశ్రామికోత్పత్తీ అభివృద్ధి మార్గాన పయనిస్తున్నాయనీ, మాన్యులు వెంగళ్రావు తమ ఆహ్వానాన్ని అంగీకరించి విచ్చేయడం ఎంతో హర్షదాయకమనీ స్వాగత వచనం పలుకుతూ కృతజ్ఞత తెలిపారు, మద్రాసు తెలుగు అకాడమీకి, భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీకి ఛీఫ్ కన్వీనరైన టివికె శాస్త్రి.

## . . . . . 12

"మన దేశంలో నాలుగింట మూడొంతులు నిరక్షరాస్యులు. ఆ నోటా ఆనోటా వినడం తప్ప చదవలేరు. అయితే కదిలే బొమ్మల ద్వారా వారు, అనేకం తెలుసుకోగలుగుతున్నారు. ఆంధ్రా జనాభా ఆరుకోట్లు; అందులో రెండుకోట్ల మందికి అందు

బాటుతో ఉంది కదలే బొమ్మల ప్రపంచం. వీడియో ప్రక్రియ సినిమాపరిశ్రమకు హానిచేస్తుందనే అపవాదుముమ్మరంగా ఉంది. ప్రతికొత్త సాంకేతిక ప్రయోగంపట్ల యిటువంటి అసహనం చూపడంసర్వసాధారణం. టివిఎంతనిజమో, విడియో కూడా అంతే నిజం. విడియో చిత్ర నిర్మాణానికి భారీ పెట్టుబడి అక్కర్లేదు. విడియోలో విజయవంతమైన చిత్రాన్నే, 35 యమ్మెమ్‌లోగాని, 70 యమ్మెమ్‌లోగాని తీస్తే, ఆర్థికంగా నష్టం ఉండదు. అయితే, ఈ విడియో థియేటర్ నిర్మాణం సహకార పద్ధతిలో జరిగితే తప్ప ప్రయోజనం ఉండదు. ఇటువంటి బృహత్ పథకం కార్యరూపం దాల్చవచ్చు. దాల్చకపోవచ్చు- అదలా వుండనీయండి.... ఒక విడియో కాసెట్ పత్రిక జూన్ 15వ తేదీన రిలీజ్ చేస్తున్నాం. ఇదొక వినూత్న ప్రయత్నం. తొంభయి నిముషాల ఈ వీడియో కాసెట్‌లో, ఎన్నో ఆసక్తిదాయకమైన విషయాలు ఉంటాయి. వెల : రు.195/- సమీపంలో ఉన్న వీడియో లైబ్రరీ నుంచి పదిరూపాయిల అద్దెకు తెచ్చుకు, చూశాక వాపసు చేయవచ్చు. ఆంధ్రాలో మూడువేల వీడియో లైబ్రరీలు ఉన్నట్లు మా అంచనా. ఈ 'పత్రిక' అయిదువందల 'కాపీలు'గా మాత్రమే మొదట్లో వెలువడుతుంది" అన్నారు ఈ ఉదయం పామ్ గ్రోవ్‌లో ఏకనాథ్ - Eknath Video (P) Ltd. Madras- 17. ముందుచూపు, ప్రేక్షకావగాహన, సాంకేతిక విప్లవం సామూహిక శ్రేయానికి దోహదకారి కావాలనే సామాజిక దృష్టి గల ఏక్ నాథ్ తన సరికొత్త ప్రయత్నంలో విజయమందాలని మా ఆకాంక్ష. సనాతనులు వెనక్కి లాగడం ప్రగతి శీలకులు ముందుకి సాగడం సర్వ సాధారణం. వీడియో చౌర్యం ఎందు వల్ల జరుగుతున్న దోసహేతుకంగా వివరించగల వ్యాపారదక్షులు ఏక్‌నాథ్‌కి మా శుభాకాంక్షలు.



మద్రాసు తెలుగు అకాడమి, 'ఛార్మ్స్' సంయుక్తంగా నిర్వహించిన సంగీతోత్సవంలో 1987 మే 4వ తేదీన మ్యూజిక్ అకాడమీలోని శ్రోతలను తన గజల్స్‌తో అలౌకికానంద సీమలో విహరింపజేసిన సౌందర్య దీపం

పీనాజ్ మసానీ

ఏప్రిల్ 1987

ఇవ్వాళ సౌరమానం ప్రకారం తమిళ ఉగాది. పదిహేడు మళయాళ చిత్రాలు, మూడు కన్నడ చిత్రాలు, మూడు తమిళ చిత్రాలు పూర్తిజేసి, ప్రస్తుతం మరొక ఏడు తమిళచిత్రాలలో బుక్ అయివున్న దేవీబాల, ఈ సాయింత్రం తెలుగు పత్రికలవారిని తమ యింటికి ఆహ్వానించింది. ఆరవ ఏట బాలతారగా సినీరంగ ప్రవేశం గావించిన దేవీబాల కనుముక్కు తీరులో, విజయలలిత గుర్తొస్తుంది. 'ఇనా' ఆమె మొదటి చిత్రం. కథానాయికగాను, ఉపనాయికగాను మూడు భాషాప్రాంతాల రాణించిన దేవీబాలను తెలుగు వెండితెరపై కూడా తొందరలోనే చూడగలరు.

. . . . .16

హర్‌భజనసింగ్ కన్వీనరుగా, గోపీ నాథరావు సెక్రటరీగా, యన్ని రాఘ వాచారి అధ్యక్షులుగా గల 'కార్డ్' (CARD- Citizens Association for Rights & Duties, ఈ సాయంత్రం 'కెన్నమారా'లో, కలకత్తా సిఖ్ కల్చరల్ సొసైటీ అధ్యక్షులైన శరణ్‌సింగ్ గౌర వార్ధం 'గెట్ - టుగదర్' (మైత్రీ సమా వేశం) ఏర్పాటు చేసింది. మూడు రోజుల క్రితం హర్‌భజన్‌సింగ్ టెలి ఫోన్ చేసి చెప్పారు - ఒకవేళ ఇన్విటేషన్ పోస్టులో మిస్ అయినా తప్పకుండా రండి—అని! ఇన్‌విటేషన్ మిస్‌కాలేదు- రెండు రోజులు ముందుగానే వచ్చింది .... హర్‌భజన్‌సింగ్ స్వాగత వచనం తర్వాత యన్ని రాఘవాచారి అన్నారు : "సునీల్‌దత్ స్వర్ణదేవాలయసందర్శనం ఆశాసూచకం. ఇరుపక్షాలలోను రాజ కీయ సంకల్పం Political Will వుంటే తప్ప పరిస్థితులు చక్కబడవు." .... "పంజాబ్ సమస్య విషయంలో 'మిత్ అండ్ మిస్ అండర్‌స్టాండింగ్' అధి కంగా ఉంది. ప్రతిరోజూ పంజాబ్ లోని హత్యలకు, దారుణాలకు నేష నల్ ప్రెస్, ఆకాశవాణి, దూరదర్శిని అవసరానికి మించిన ప్రాముఖ్యమిస్తు న్నారు. యునైటెడ్‌న్యూస్ అఫ్‌ఇండియా (UNA) లెక్కల ప్రకారం 1986లో బీహారులో 3 వేల 4 వందలనల భై హత్యలు జరిగాయి. రోజుకి తొమ్మిదీ పదీ చొప్పున - కారణాలెటువంటివైన ప్పటికీ అవీ హత్యలే! పంజాబ్‌లో



మద్రాసు తెలుగు అకాడమీ ఉపాధ్య క్షులు డా॥ బాలమురళీ కృష్ణకు, 'భార్మసూ', అకాడమీ సంయుక్తంగా, నిర్వహించిన సంగీతోత్సవానికి (2-5-87), ఒక రోజు ముందుగా అయ్యర్ నిర్మించిన 'మధ్వాచార్య చిత్రంలోని ఉత్తమ సంగీత దర్శకత్వం బహుమతి జాతీయస్థాయిలో లభిం చడం, ఆయన అభిమానులకు, అసం ఖ్యాక మిత్రులకు ఎంతో ఆనందాన్ని యిచ్చింది. ఏడేళ్ల తర్వాత మద్రాసులో పాడారు . మ్యూజికల్ జీనియస్ బాల పండిట్ జస్‌రాజ్‌తో జుగల్ బందీలో.

---

మేము కొలిచే దేవత పేరు స్వాతం త్ర్యం - ఆమె మా రాజ్యమేలే రాణి.

—ఎమర్సన్

# ముఖచిత్రం

"నేటి ప్రపంచంలో రోజుకి వెయ్యి పుస్తకాలు విడుదలవుతున్నాయి. మన దేశంలో 1970లో 18,000 పుస్తకాలు వెలువడాయి. 1976లో ఆ సంఖ్య 15,400 కాగా, 1984 నాటికి 10,000 అయింది. ఇందులో 40 శాతం ప్రభుత్వము, ఇతర సంస్థలు ప్రచురించేవి.... మనకు స్వాతంత్ర్యం వచ్చే నాటికి అక్షరాస్యత 17 శాతం - 1981 నాటికి అది 37 శాతం అయింది. కాని పుస్తకాలు చదివే అలువాటు పడిపోయింది. యూరప్‌లో ఆర్చిబాల్ కానిస్టేబుల్ వంటివారు, 'లిటరేచర్ ఫర్ ది మిలియన్స్' అనే ఉద్యమం ప్రారంభించి, ప్రజానీకంలోని పఠనా సక్తిని పెంచారు. మన దేశంలో పత్రికలు, - ఇంగ్లీషులోను ఇతర ప్రాంతీయ భాషలలోను, అధికంగా అమ్ముడవుతున్నాయి గాని పుస్తకాలు వెనకబడ్డాయి. ప్రజలలో పుస్తకాలు చదవాలనే అభిలాష తగ్గిందా, లేక రేడియో, టెలివిజన్‌ల ప్రభావమా?

"సక్రమంగా చదవలేని ప్రపంచం సరిగా ఆలోచించలేదని నా విశ్వాసం. రాధాక్రిష్ణన్ ఏనాడో చెప్పారు – భారతీయ సాహిత్యమంతా ఒకటే; కాని, వివిధ భాషలలో వెలువడుతోం దని. ప్రాకృతము, సంస్కృతము ప్రాంతీయ భాషా సాహిత్యాలకు పుష్టి నిచ్చిన మాట ఎవరూ కాదన లేరు. మధ్య యుగంలో అరబిక్, పర్షియన్ భాషల నుంచి అనువాదాలు వచ్చాయి. ....పాశ్చాత్య టెక్నాలజీ కారణంగా ప్రపంచం ఈనాడు ఏక ఖండం అయింది. అయితే ఆ విజయం భౌతిక స్థాయిలోనే!

"పుస్తకాలంత శక్తివంతమైన సాధనాలు మరొకటి లేవు. వాల్టె, రుసో, మార్క్స్, టాల్‌స్టాయ్, కార్లయిల్, స్టువార్ట్‌మిల్, థామస్ పెయిన్ వంటివారు తమ సృజనాత్మక శక్తి ద్వారానే విప్లవ బీజాలు నాటారు. సోఫోక్లిస్‌ని అతని కొడుకులు కాద న్నారు; కారల్‌మార్క్స్ దారిద్ర్య బాధని అనుభవించాడు. మపాసా తిండిలేకుండా గడిపాడు. కాని, మాన వాళికి వారు మహాసంపద నిచ్చారు. విక్రమ్‌సేథ్ (Vikram Sathe - The Golden Gate) అమితావ్ ఘోష్ (Amitav Ghosh - The Circle of Reason) వంటివారు ఇంగ్లీషులో వ్రాసిన కారణంగా పిన్న వయసులోనే ప్రపంచ ప్రఖ్యాతిని పొందగలిగారు .... కేరళలోని సాహిత్య ప్రవర్తక్ కోపరేటివ్ సొసైటీ అన్ని రాష్ట్రాల రచయితలకు మార్గదర్శకం" అన్నారు, గుజరాత్ గవర్నర్ త్రివేదీ, అహమ్మదాబాదులో 1987 ఫిబ్రవరి 28 వతేదిన జరిగిన ఆదర్స్ గిల్డ్ 13వ జాతీయ సదస్సులో 13th National Convention of Authors Guild of India.

సాధించిన విజయాలు, సంగీత సాహిత్యాలపట్ల, స్నేహానురాగాలపట్ల ఆయనకుగల ఆపేక్ష, జీవితాన్నొక వసంత వన వాటికలా చూడగల ఆయన సౌందర్య తృష్ణ— యిలా చెబుతూంటే చాలా వున్నాయి. గోపాల రెడ్డిగారు మాకెంతో ఆప్తులు గనుక ఈ చెప్పినది చాలు.

. . . . . 21

జాతీయ సమైక్యతను లలిత కళల ద్వారా సాధించడమే ధ్యేయంగా గల మద్రాసు తెలుగు అకాడమీ, వియస్‌టి ఇండస్ట్రీస్ సహకారంతో ఛార్మ్‌స్ సంగీతోత్సవాన్ని, మ్యూజిక్ అకాడమీలో మే నెల రెండు, మూడు, నాలుగు తేదీలలో సమర్పింపనున్నది. అకాడమీ అధ్యక్షులు బాలమురళీకృష్ణ, కళాకారుల మధ్య పరస్పర అవగాహన, సమైక్యతాదృష్టికి ఎంతో అవశ్యకమని అన్నారు – వుడ్‌లాండ్స్‌లో జరిగిన పత్రికా సమావేశంలో. ఉత్తర దక్షిణాల కలయిక అయిన ఈ జుగల్ బందీ సంగీతోత్సవాలు, భిన్నత్వంలోని ఏకత్వాన్ని విశదపరుస్తూ మనమంతా ఒకటేనను భావాన్ని ప్రోదిచేస్తాయని అన్నారు అకాడమీ సారధి టివికె శాస్త్రి. 'ఛార్మ్‌స్' సహకారం గురించి చెప్పారు శర్మ. మొదటి రోజున, అంటే మే రెండవ తేది జుగల్‌బందీ: బాలమురళీ కృష్ణకు, మృదంగంపై శివరామన్, వయొలిన్‌పై శశికుమార్ – పండిట్ జస్‌రాజ్‌కు, తబ్లా మహాపురుష్ మిశ్రా, హార్మోనియమ్ జలగాంకర్ .... రెండవ రోజున (మే – 3) జుగల్

## పసిడి పలుకులు

ఎదుటవారిని కించపరచటం ధనవంతుల వినోదం —మాంటిక్యు

ప్రతీరాజూ బానిసల వంశంనుంచి పైకి వచ్చినవాడే - అలాగే ప్రతీ బానిసకీ పూర్వీకుల్లో రాజులున్నారు. —ప్లాటో

మన వాదనలో మనం ఓడిపోయినప్పుడు, ప్రత్యర్థిని తిట్టక ఏమిటి చేయడం? —హబ్బర్డ్

నేను అందమైన పటం చిత్రించినప్పుడల్లా ఒక మిత్రుని కోల్పోతున్నాను. — జాన్

ఉత్తమ కళకు గల ప్రధాన లక్షణాలు ఏమిటంటే, అది వర్ణనకు లొంగదు, అనుకరణకు లోబడదు. —రేనె

మంచిసలహా విన్నప్పుడు చేయవలసినదేమిటంటే, అది మనకు ఎలాగూ ఉపయోగపడదు గనుక ప్రక్కవాళ్ళకు అందించడం. —ఆస్కార్ వైల్డ్

పైకి ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా ఒక అధికారంపై పాలింపబడాలనే సహజ వాంఛితం మానవునిలో అంతర్గతంగా ఉంది. — గోతె

ఆత్మకథలు వ్రాసేవారందరికీ – అగస్టయిన్ నుంచి నేటివరకు - తాము చేసిన పాప కార్యాలపై సరదా. — యానటోల్ ఫ్రాన్స్

బందీ: ఫ్లూట్ (వేణుగానం) – హరి ప్రసాద్ చౌరాసియాకు తబ్లా అనిందో ఛటర్జీ, రమణికి మృదంగం భక్తవత్స లం .... ఇక మూడవ రోజున (మే – 4). అద్వితీయ గాన మాధురీలతిక పినాజ్ మసానీ గజల్స్. గంధర్వ కాంత అవతరించిందా అనిపింపజేసే పినాజ్ మసానీకి, హార్మోనియం సిరాజ్ ఖాన్; తబ్లా: వసిఅహ్మద్, మాండలిన్: నజీర్ అహ్మద్ .... మద్రాసు తెలుగు అకాడమీకి మూలస్తంభం (ఛైర్మన్) ప్రముఖ పారిశ్రామిక వేత్త పి. ఓబుల్ రెడ్డి – సంగీత సాహిత్యాలపై ఎంతో మక్కువగల రసజ్ఞులు, కళాపిపాస గలవారు.

## 23

పోయిన సంవత్సరం యిదే రోజు సాయంత్రం నాలుగు గంటలకు భక్తి గీతాలు వింటూ పరమాత్మలో అయిక్య మయారు మాకు అత్యంత సన్నిహితు లైన వియన్ శర్మగారు. శర్మా దంప తులు స్థాపించిన చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలు, కొన్ని లక్షల మంది మన సున నిలిచే బాలోద్యానవనం. ఈ సంవత్సరం సెప్టెంబరులో స్వర్ణోత్సవం చేసుకోనున్నది. ఏడెనిమిదేళ్ల క్రితం మిసెస్ ఎల్లెన్ శర్మ దివంగతులయారు; శర్మగారు ఈ స్వర్ణోత్సవం తమ కళ్లతో చూసి, ఆమెకి చెబుతారని ఆశించాము. 'విధి బలాఢ్యుడు' అని భర్తృహరి చెప్పినా, మనసున రగిలే ఆశ పీకుతూ వుంటుంది .... ఈ ఉదయం ఆయన స్మృత్యర్థం ప్రార్థన సమావేశం. .... ఆ కాం శర్మగారు ఎలా సజీవులై వున్నారో, అదేవిధంగా మా యింట్లో, మా మనసుల్లో, మా జీవితాలలో, సచేతన భాగమై వారు వున్నారు – మాతోబాటే ఉంటారు.

## ..... 24

'ఇంటర్‌ఫెయిత్ మువ్‌మెంట్ ఫర్ హ్యూమన్ సాలిడారిటీ' (Interfaith Movement for Human Solidarity) అనేది సర్వమత సహనంద్వారా శాంతిని కాంక్షించే సంస్థ. అన్ని మతాలూ మానవాభ్యుదయాన్నే కోరు కుంటాయి. అయితే, ఆచరణలో అల్ప బుద్ధులు వాటికి వింత అర్థాలు కల్పించి, సద్బోధలను కలుషపరు స్తారు. ఏప్రిల్ 25 వ తేదీ సాయంత్రం అయిదు నుంచి ఏడు గంటలదాకా, మద్రాసులోని 'గాంధీ మండపం'లో ప్రార్థన సమావేశం ఏర్పరిచారు ఈ సంస్థవారు. అన్ని మతాలలోని ప్రార్థన గీతాలు (hymns) పాడతారు; ఉపన్యా సాలు వుండవు; మధ్య మధ్య రెండేసి నిముషాలు మౌనం పాటిస్తారు. ఈ మౌన ప్రార్థన, చైతన్య కారకమవాలని వారి సదాశయం. హోటల్ మారిస్‌లో జరిగిన పత్రికా సమావేశానికి, కార్య దర్శి హర్‌భజన్ సింగ్ స్వాగతం తెలు పగా, క్లెమెంట్ ఫెలిక్స్ కార్యక్రమ విశేషాలు వివరించారు. ధ్యానమూ జ్ఞానమూ పైమెట్టు దాటాక రెండూ ఒకటే, అనే సాంస్కృతిక వారసత్వం భారత జాతిది.

—యన్నార్ చందూర్

